## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016368

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పీఠిక.

ఇక్కాలంబునఁ బౌరమహాశయులకుఁ జారిత్రాత్మకములందెక్కువ మక్కువ జనియించుటచేఁ దద్విషయకగ్రంథం బొండు రచియించి పాఠకలోకమున కర్పింపఁ గౌతూహలాయత్తచిత్తుండనై, తద్రచనాసమర్థత లేని నేను మాతాభక్తి చందంబున నాంధ్రభాషామతల్లిని సేవించి కృతకృత్యుండఁ గాఁదలంచితి.

మఱియు విద్యార్థుల కోమల హృదయ క్షేత్రంబుల దేశపాలుర, దేశాభిమానుల, ప్రభుభక్తిపరాయణుల మహాకవీశ్వరుల నిష్కళంకచారిత్రబీజంబులు నాటఁ బడినచో భావికాలపౌరులగు నేఁటి విద్యార్థులు దేశోద్ధారకులు కాఁగలరను సంపూర్ణ విశ్వాసంబున, నసమానకీర్తి విరాజితులై నెగడిన మహీపాలురయొక్కయుఁ, దమ యమోఘ వాక్పటిమచే భోగుల జోగులుగను,జోగుల భోగులుగ నొనర్చి రాజసన్మానంబులఁ బడసిన కవిచంద్రుల యొక్కయు, జీవ చరిత్రముల యథాశక్తి వచన రూపంబున నిచటఁ బొందు పఱచితిని.

ఈ గ్రంథరచనకు విషయసంపుటీకరణంబునఁ శ్రీ వీరేశలింగము పంతులుగారి కవుల చరిత్రము, చంద్రగుప్త చరిత్రము, శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారి తిమ్మరుసు చరిత్రము, నాకెక్కుడు సహకారములగుటచే నేత

ద్గ్రంథ రచయితలకును గ్రంథ ముద్రణాకాలంబునఁ గొన్ని మార్పులఁగావించి సాహాయ్యమొసంగిన మన్మిత్రవర్యులగు బ్రహ్మశ్రీ శిష్టా వేంకటసుబ్బయ్యకవిగారికిని, ముద్రణాస్ఖాలిత్యంబులఁ జక్కఁచేయుటలో శ్రమవహించి గ్రంథము ముద్రణము గావించిన శ్రీ సీతారామా ముద్రాశాలాధి పతులగు పోతరాజు అక్కిరాజు అండ్ సన్సు వారికిని మదీయ కృతజ్ఞతా ధన్యవాదములు.

ఈ గ్రంథంబునందలి శ్లోకములు, పద్యములు, కాలనిర్ణయము లాయాగ్రంథంబుల నుండియే సేకరించి, వాని యభిప్రాయంబులమాత్రము సులభగ్రహణార్థము వ్రాసినాఁడను.

విద్యాశాఖాధికారులు, పాఠశాలాధిపతు లీగ్రంథము నాదరించి పాఠశాలాపాఠ్య గ్రంథముగ నిర్ణయించి ప్రోత్సహించిన గ్రంథకర్త యాశయము సఫలముకాఁగలదనియు, క్షేమాభిలాషులగు మిత్రవర్యులిందలి స్ఖాలిత్యంబులఁ దెలిపిన వందనపూర్వకముగ గ్రహించి ద్వితీయముద్రణంబున సవరించుకొనెదననియు విన్నవించుకొను చున్నాఁడను.

| | |
|---|---|
| శ్రీ ప్రజోత్పత్తి సంవత్సరధి కాషాఢ బ ౧౦ శుక్రవారం<br>న ర సా పు ర ము. | ఇట్లు,<br>వి ద్వ ద్వి ధే యుఁ డు,<br>బూరుగుల పూర్ణయ్యశర్మ. |

హైదరాబాదు సంస్కృత పాఠశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులగు

బ్రహ్మశ్రీ దర్భా జగన్నాథశాస్త్రిగారొసంగిన

యభిప్రాయము.



బ్రహ్మశ్రీ బూరుగులపూర్ణయ్యశర్మగారిచేఁ బ్రణీతమగు మేధానిధులను గద్యకావ్యమును నచ్చటచ్చటఁ జదివినాఁడను. అందలి కథలా చదువరుల హృదయరంజకములు. శైలియా యత్యంతగూఢంబును గడుతేటఁదనము గాకుండ నొప్పారుచున్నది.

చాలకాలమునుండి యుపాధ్యాయపదవి నొంది యనేకగ్రంథ రచనాకుశలులగుటంజేసి బడిబాలుర కత్యంతోపకారకంబుగ నద్దాని విరచింప సమర్థులయి యున్నవారు. పురాతనాధునాతన మేధావిరత్నంబుల చరిత్రములందుఁ బొందుబడియుంటచే వానింజదివి దేశాభిమానపరోపకారాదిగుణముల నలవరుచుకొని చదువరులు తమజీవితంబుల నత్యున్నతంబులుగఁ జేసికొనఁ జాలుదురనుటకు సందియ మిసుమంతయు లేదు. ఈయర్థమునే యొక హూణకవిరత్నంబు నొక్కి వక్కాణించియున్నాఁడు:-

Lives of great men all remind us
We can make our lives sublime.

విద్యాశాఖాధికారులు దానిని పాఠశాలలందుఁ బఠనీయగ్రంథముగ నేర్పాటు గావించియు విద్యాభిమానులద్దాని నెల్లయెడలం బ్రాచుర్యము నొందించియు గ్రంథకర్తను బ్రోత్సహింతురని గాఢంబుగ విశ్వసించుచున్నాను.

నరసాపురం,
6—7—31.

దర్భా జగన్నాథశాస్త్రి.

# మేధానిధు

## 1. విక్రమార్కుఁడు.

ధరామండలమండనాయమానంబగు మాళవదేశం బునకుఁ దిలకంబునానొప్పు, నుజ్జయినీపుర వరంబునఁ జంద్రశర్మాభిధేయుండగు ధరామరుండొండుండె. అతండు దొలుతొలుత నిరక్షర కుక్షియగుటం జేసి, నిజసోదర కటాక్షాపేక్షియయి, యుదరపోషణముఁ గావింపుకొనుచుండ, నొక్కనాఁడు సోదరకళత్రంబు నిందింప నభిమానావేశ స్వాంతుండై విద్యార్జనాసక్తి గృహంబువాసి, యొండెడకుం బోవ [illegible]ట్టి, ప్రయాణోన్ముఖుండై యొక్క ఘోరకాననాంత[illegible]మార్గంబునఁ జొచ్చి వెడలుచుండెను. అటులఁ జను [illegible]డ సంధ్యాకాలంబగుడు నొక్క సలిలాశయము చెంత సంధ్యవార్చికొనుచుండ శాపానలదగ్ధుఁడగు భూసురవేష ధారియగు ప్రచ్ఛన్న బ్రహ్మరాక్షసుండీ పాఱుండుండిన కాసారంబును సమీపించి యాతనిఁగాంచి యవ్యాజ కరుణాపాంగదృష్టి న్విలోకించి నిర్నిద్రా నిరశనవ్రతంబుల నొక్క వత్సరకాలంబున నమ్మహీసుర పుంగవుని సకల కలాధురీణుఁగావించి గృహంబునకనిచెను. అప్పేదబాపండు గృహాభి

ముఖుండయి మార్గమధ్యంబునందొక శూద్రి వేశ్మపురో భాగవేదికపై శయనించి యొడలెఱుంగక నిద్రించుచుండెను. అచట నన్నులమిన్నయగు నొక్క శూద్రికాంత యా నిద్రావేశిత భూసుర రూపరేఖా విలాసంబులఁ గాంచి మోహించి యంగజుబారి కగ్గమై యాభూదేవునిఁ బరిణ యంబాడ నిజమనోగతంబు విశదీకరింప నాతండియ్యకొనఁ డయ్యెను. ఎట్టకేలకామహీకాంతు నానతి ధర్మశాస్త్రాను సరణి బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రికాంతల నల్వురఁ బరిణయంబాడి, క్రమంబున నయ్యంగనామణులవలన, వర రుచి, విక్రమార్క, భట్టి, భర్తృహారులను పుత్రచతుష్టయం బులఁ బడసెను. రాజానుగ్రహ పాత్రుండగు భర్తృహారి పట్టాభిషిక్తుండయి రాజ్యపాలనంబుఁబూజ్యంబుగానొనరింపఁ దొడంగెను. ఆతండు ప్రజలనిజప్రజలభంగి నాదరింపుచు, దుష్టశిక్షణ శిష్టరక్షణలఁ గావింపుచు వ్యవహారదక్షుండై సర్వసౌఖ్యంబుల నవ్వారిగా నొసంగుచు వైరివీరమారకుం డగు విక్రమార్కుండు సోదరయుతుండయి యింపుగఁ బాలనంబు సల్పుచుండెను. ఆ రాజచంద్రుని పాలనాకాలం బున జనులు క్షామ, చోర, వ్యాధి బాధితులు గాకుండిరి. కఱవనుశబ్దమే వారికి వినఁగఱవయ్యెను. జనులనుండి కైకొ నఁబడిన పన్నుల ధనంబున కినుమడించిన స్వార్థంబుఁజేర్చి ప్రజాసౌకర్యార్థంబు వినియోగించి, "రాజా ప్రకృతిరంజ

నాత్" అను వాక్యార్థమును సార్థకపఱచుచుండెను. అక్కా
రణంబునం జేసి పాలకపాలితులు క్షీరోదకన్యాయంబున
మెలఁగుచుండిరి.

ఆకాలమునం దుజ్జయినీపురంబున సకల కలాధురీణుం
డును సర్వశాస్త్ర విశారదుండును మంత్ర, తంత్ర మర్మజ్ఞుం
డును నిర్ధనుఁడునగు నొక్క ధరామరుండుగలండు. అతండు
నిజమంత్ర ప్రభావిశేషంబున నొక్కనాఁడు భక్తాభీష్ట
ప్రదాయినియు సర్వపాప సంహారిణియు విశ్వపావనియునగు
భువనేశ్వరిని మెప్పింప నాయమ కడునలరి యప్పుడవాని
నకు సంతత యౌవనంబును జరామరణ రాహిత్యంబును
బ్రసాదించు నొక రసాలఫలంబొసంగెను. ఆ బ్రాహ్మణ పుం
గవుండపరిమితానంద భరితాంతరంగుఁడై యాఫలంబు
నింటికిఁ గొనిపోయి నిత్యకర్మానుష్ఠానానంతరంబు దాని
భక్షింప సిద్ధంబగుచుఁ దద్వికల్పంబగు సంకల్పంబొండా
తని హృదంతరాళంబునఁ బొడవ నిటుల యోజింప మొద
లిడెను. "నే నా గర్భదరిద్రుండను. అనవరత భిక్షాటనవృత్తి
చే జీవించు నేను నిరంతర యౌవనంబును జరామరణ
రాహిత్యంబునుబడసి యేరి కుపకరింపఁగలను? పరోపకార
శూన్యుండనగు నేను జిరకాలము మనుట ధరాభారంబు
గాదె? ఎవ్వానిజీవితంబు లోకహితార్థంబుపకరించునో
యయ్యదియే సార్థకజీవితంబు పరోపకార శూన్యమై స్వో

దర పూరణంబుఁ గావించికొనుచు వాయసంబు మనుట లేదె? ఛీ! నేనీఫలమును భక్షించి చిరకాలజీవినగుట లాభం బావంతయుఁ గన్పట్టదు. జ్ఞాన శౌర్య మానధనుల జీవితంబొక దినంబేనిఁ జాలు. కావుననే యార్యులిందుంగూర్చి

శ్లో॥ యజ్జీవతిక్షణమపి ప్రథితైర్మనుష్యో!
విజ్ఞానశౌర్య విభవాదిగుణైః సమేతః।
తత్తస్యజీవితఫలం ప్రవదన్తిసన్తః।
కాకోపిజీవతి చిరాయు బలించభుజ్తే॥

శ్లో॥ యస్మిన్ జీవన్తిబహవః సతుజీవతు।
బకోపికింనకురుతే చఞ్చ్వాస్వోదరపూరణమ్॥

శ్లో॥ క్షుద్రాస్సన్తిసహస్రశః స్వభరణవ్యాపారపూర్ణాదరాః
స్వార్థోయస్యపరార్థ ఏవసపుమానేకః సతామగ్రణీః
దుష్పూరోదర పూరణాయ పిబతిస్రోతః పతింబాడబో
జీమూతస్తు నిదాఘసంభృత జగత్సంతాపవిచ్ఛిత్తయే॥

విజ్ఞాన పరాక్రమైశ్వర్యాది గుణయుతుండగు మానవుని జీవితమొక క్షణకాలమైనను ఫలదాయకము. బలిని మెసవుచు వాయసము చిరకాలము మనుటలేదా! ఎవఁడు పరార్థప్రదాయకుఁడో యాతఁడే చిరకాలము జీవించుఁగాక, లేనిచో బకము ముక్కుతో స్వోదరపూరణముఁ గావించుకొనుటలేదా! స్వోదర పూరణాసక్తులగు స్వార్థపరులు వేలకొలఁది గలరు. వారి మనుగడ యెట్టి లాభకారిగాఁగలదు?

స్వార్థమును బరార్థముగానెంచి యన్యకార్య నిర్వహణ తత్పరుండగువాఁడే సత్పురుషాగ్రగణ్యుఁడు. బడబానలము స్వోదర పూరణార్థము సాగరజలమును బానమొనరించు చున్నను మేఘుఁడు వేసవిచేగాసిఁ జెందినలోకతాపమును వారింప సాగరోదకమును బానముసేయుచుండలేదా! నేనీ ఫలమును భక్షించి, భూతలంబున బహుకాలము జీవించుట కంటె నీమహీపాలున కొసంగిన నాఁడీఫలమును భక్షించి జరామరణ రహితుండై ధర్మానుసరణిఁ బెద్దకాలము చతు ర్వర్ణంబులఁ బాలింపఁగలండు. అద్దాన లోకంబు సుఖయిం చు" నని తలపోసి యా రసాలఫలంబుఁ గొని రాజసన్నిధి కిఁజని యారాజుచే నమస్కృతుండయి యాతనిఁ బెక్కు గతుల నాశీర్వదించి యాఫల మహాత్వంబెఱింగించి తద్భ క్షణంబున సుఖపాలనం బొనరింపుమని యాఫలం బొసం గెను.

అప్పుడమితేఁడా ఫలంబుగైకొని బ్రాహ్మణుని సత్క రించి యనిపి యనుంగు ప్రియసియుఁ బ్రాణసమానయు నగు ననంగసేనయను నంగనామణికి నాఫలంబొసంగనాపె తన ప్రియుండగు నొక్క మందడీనికిని నాతఁడు మఱియొక దాసీకన్యకను నక్కన్యక వేటొందు పసులకాపరికిని నాతం డొక గోమయధారణికి నొసఁగిరి. ఆయమ యాఫలంబును దన గోమయ పాత్రపై నిడికొని వీధివెంబడిఁజనుడు నాభూ

సురోత్తముండా ఫలమునుగాంచి గుర్తించి యాఫలంబచ్చో టునకెటుల రాగలిగెనోయని యచ్చెరువంది రాజసమ్ముఖంబునకు వనితాద్వితీయుండయి చని ఫలవృత్తాంతంబు రాజువలన నెఱింగి రాజునకొసంగ నారాజచంద్రుండు మనంబునఁ బలుతెఱంగుల నూహించి స్త్రీలచిత్తవృత్తిని గూరిచి యిట్లు వక్కాణించెను.

శ్లో॥ అశ్వప్లుతం వాసవగర్జనంచ!
స్త్రీణాంచ చిత్తమ్ పురుషస్యభాగ్యమ్।
ఆవర్షణంచాప్యతి వర్షణంచ।
దేవోనజానాతి కుతో మనుష్య॥

శ్లో॥ గృహ్ణాన్తి విపినేవ్యాఘ్రం। విహంగం గగనే స్థితం
సరిన్మధ్యగతం మీనం। నస్త్రీణాం చపలం మనః॥

శ్లో॥ హీనభాగ్య స్యరాజ్యశ్రీః। పుష్పశ్రీ ర్గగనస్యవా।
భవేదేవ నతుస్త్రీణాం। మనశ్శుద్ధిర్మనాగపి॥

శ్లో॥ వినాయంత్రేణ మంత్రేణ తంత్రేణ వినయేనచ।
వంచయన్తినరం నార్యః। ప్రజ్ఞాధిన మపిక్షణాత్॥

గుఱ్ఱపు నకిలింపును, మేఘపుటుఱుమును, స్త్రీల మనోవృత్తియును, పురుషునిభాగ్యమును, అతివృష్ట్యనావృష్టులను భగవంతుఁడే యెఱుంగఁ జాలండనినపుడు మనుజుఁ డెట్లు తెలియఁగలఁడు.

కాననాంతరమున సంచరించు వ్యాఘ్రమును గగనాంతరవర్తనంబగు కాకమును సలిల మధ్యంబున వసించు మీనములును బ్రహ్మాదిమునులకైనగాని స్త్రీల మనస్సిద్ధి యించుకంతయుఁ దెలియఁబడఁజాలదు.

ఎట్టిపరిజ్ఞానవంతుండైన పురుషుండైనను స్త్రీలు యంత్ర మంత్ర, తంత్రవిషయము లక్ష్యములేకయే సులభముగా మోసము సేయుదురు.

వైరాగ్యముకంటె భాగ్యము, జ్ఞానముకంటె మిత్రము, విష్ణువుకంటె దైవము, సంసారముకంటె శత్రువు నన్యములేదు. అని శాస్త్రములు వక్కాణించుచుండఁ గేవలము స్త్రీలనమ్ముట కేవలము మహామోహము. ఇట్టి యవివేకప్రపంచంబునఁ జరించుచు నాగ మోహావేశంబులఁ దగుల్పడి నరకకూపమునఁ ద్రెళ్ళుటకంటె దుర్విషయ మేమి కలదు? కావుననే

శ్లో॥ న వైరాగ్యాత్పరం భాగ్యం । న బోధాత్పరః సఖా
నహరేరపరస్త్రాతా । న సంసారాత్పరో రిపుః ॥

అని చెప్పఁబడియుండెఁ గావున సంసారంబసారంబుగ నెంచి శ్రీహరి చరణారవింద ధ్యానతత్పరుండనయి, యుగ్రాటవి ఘోరతపంబొనర్చి తపనుగ్రహంబు వడయ నిశ్చయించి నిండారుప్రేమంబు గదుర పరిమార్గాభిధానుండగు సోదరుఁ జేరి తనయుద్దేశమ్ము యుగ్రముగల బాసంగి

రాజ్యాభిషిక్తునిగావించి తపోవనమునకుం జనియెను.

## —: రా జ్య ప్రా ప్తి :—

విక్రమార్కుండక్షీణ పరాక్రమ దక్షుండై సింహాసనా సీనుండై వైరివీరనికాయంబుల వశముఁగావించుకొని సోదరునానతి నౌదలఁ దాలిచి ధరాపాలనంబుఁ గావింపఁదొడంగెను. ఆతని పాలనంబునందనువుమెయి సుఖయింపని మనుజుండులేఁడనుట నిక్కంబు. ఆబాలగోపాలమమందానందకందళిత హృదయారవిందులై నెగడిరనుటతిశయోక్తి గాఁజాలదు.

శ్రితజనమందారుండును శత్రుభయంకరుండును శిష్టజనరక్షకుండునునై లోకజనవందితౌదార్య సంభావ్యంబుగఁ బ్రజాపాలనంబు నొనరింపుచుండెను. దుష్టసంకల్పాంతరంగుఁడగు దిగంబర యతీశ్వరుం డా భూమీశ్వరు పాలికిం జనుదెంచి యాశీర్వదించి రానున్న కృష్ణచతుర్దశినాఁడు తానొక యాగమొనరింప సమకట్టితిననియు నయ్యది సామీప్యస్థ శ్మశానవాటికయందు నెఱవేర్పఁబడుననియు, నచ్చోటునకు విచ్చేసి యజ్ఞము బూర్తిగావింపఁ దద్రాజశిఖామణిని బ్రార్థించెను. ఆరాజు నచ్చోటునకుంగొని పోయి దేవికి బలినిడి తనయభీష్టంబుఁ దీర్చికొనఁదలంచి యటులఁ బన్నాగముఁ గావించెనుగాని విక్రమార్కుండు తన పరాక్రమంబున భేతాళున్వశపఱిచికొని యాతని యుప

దేశానుసరణి యతినే దన శాతాసినిశితుంగావించి యష్టసిద్ధు లంబడసి కీర్తివిరాజితుండై సుఖంబుండె.

**– ♦ ఇందుడ్రు విక్రమార్కునకు సింహాసన మొసఁగుట ♦ –**

సకలబృందారకగణవందితుండును, తుంబుర నారదాది యోగిజనపరివృతుండును, వాచస్పతి సమేతుండునునగు నాక లోకాధీశుండు, నిండోలగంబుననుండి యొకదినంబున విలా సార్థంబు దనయప్సరోగణంబునఁ బ్రఖ్యాతిఁ గాంచిన రం భోర్వసుల నృత్యంబవలోకించి, సంతుష్టాంతరంగుం డ య్యెను. అంత సభ్యులనవలోకించి, యావారనారీనర్తనా నైపుణ్యతారతమ్యంఁ జెప్పఁబుపఁగోర, నందొక్కరు నుచిత సమాధాన మొసంగఁగల నేర్పరులుగనప్పటమిఁ, దిరిలోకసం చారుండగు నారదు నాసందియము నివారింపుమనియె. "అప రసురపతి యనంబరఁగు నుజ్జయినీపురపతి, గానవిద్యా విశా రదుండును జతుష్షష్టికళాకోవిదుండును నగుటంజేసి, య తఁడ, యీ సందియంబు వాపసమర్థుండు" అని నారదుండు విన్నవింప, వాసవుండా యుజ్జయినీపురాధీశుండగు విక్రమా ర్కునిగొనిరా మాతలింబనిచెను. మాతలి తత్క్షణంబరదంబు నెక్కి యుజ్జయినికిం జని, విక్రమార్కుని దర్శించి, పాకశా సను శాసనంబెఱింగించి, భేతాళసహితంబుగఁ దేరు నధిరో హింపఁజేసి, యమరావతికిం జేర్చెను. ఆ నిలింపాధ్యక్షుండు విక్రమార్కు నెదుర్కొని, స్వాగతింబొసంగి, బహుమాన

పురస్సరంబుగఁగొని తెచ్చి, సింహాసనాసీనుఁగావించి, యాతని రప్పించిన కారణంబెఱింగించెను. ఆతండా కళావతుల నర్తనా నైపుణ్యంబు వీక్షించి, నృత్యశాస్త్ర రహస్యంబు లుపన్యసించి, యుగ్రస్థానం బూర్వశికి నొసంగెను. నాకపతి యా యవనీపతి నేర్పరితనంబున కెంతయు లోన నలరి, యత్యంత రమణీయంబులగు ద్వాత్రింశద్భంజికాయుతంబగు సింహాసనం బొసంగెను. విక్రమార్కుం డాయోలగంబు స్వీకరించి, బిడౌజు నాజ్ఞఁబడసి, యిలాతలంబున కరిగి, ధర్మపరీత చేతస్కుండై, రాజ్యంబుఁ బూజ్యంబుగఁ బాలింపఁ దొడంగెను.

ఇటులఁ గొంతకాలంబు విక్రమార్కుండు, సాహసౌదార్య, వినయ, గాంభీర్య హృదయుండయి పరమాహ్లాదంబున రాజ్యం బేలుచుండెను. అటులఁ జిరకాలంబుగడచుడు నొక్కదినంబున నుజ్జయినీపురంబున నుల్కాపాతంబులును, దిగ్దహనంబులును, భూకంపంబులును మున్నగు నరిష్టసూచకంబు లుత్పన్నంబులు గాఁదొడంగెను. తేనియానతి దైవజ్ఞులయ్యవి యరిష్టదాయకంబులని విన్నవించిరి. పదపడిఁ దన యుగ్రతపంబునకుఁ బరమేశ్వరుండు మెచ్చి, మరణరాహిత్యవరంబొందువినా యన్యమెద్దియయినఁ గోరుమనఁ దన కు ద్వితీయవర్షప్రాయకన్యకా జనితపుత్త్రుండగు బాలకుని చే మరణం బనుగ్రహింపుమని వేడ నప్పరమేశుండట్లనుగ్రహించెనని కాలజ్ఞు లెఱింగించిరని తెలిపి, యట్టిబాలుం డె

చ్చోటఁ గలండో విచారించి తెలుప భేతాళు నాజ్ఞాపించెను.

—♦ విక్రమార్క శాలివాహన సమరము ♦—

భేతాళుండు విక్రమార్క భూపాలునాన నౌదలంబూని, సాంద్రారణ్య పరిసరభాగములను, వివిక్తప్రదేశంబులను గ్రుమ్మరి, మెట్టకేలకుఁ బ్రతిష్ఠాన నగరంబునఁగల యొక కులాలకగృహంబునందొక్క కన్యకామణియు, నాపెచెంగట నొక పసిపాపండును, ధూళింబొరలుచు నాడుకొనుచుండఁ గాంచెను. ఆపెవలన నానిసుంగాపె పుత్త్రిగా నెఱింగి, యాపె జనకుని నామముఁ దెలుపఁ గోరెను. భేతాళుని పృచ్ఛపై, నా చెంతఁ గల యొక గేస్తుం డరుదెంచి, యబ్బాలిక తన తనూజాత యనియు, నాపె రూపలావణ్య విశేషంబులకు నాగేంద్రుఁడు మోహింపఁ దత్ప్రసాదంబున నా పాపం డుద్భవించెనని భేతాళున కాగృహమేధి సమాధానమొసంగెను. భేతాళుం డీవార్త నాలించిన వెంటనే యుజ్జయినికిం జని, విక్రమార్క భూపాలచంద్రునకు శ్రుతపఱుప నాతండు గేల ఖడ్గంబు ధరించి, యబ్బాలుని వధింపఁ జనెను.

—♦ ప రా జ య ము ♦—

కులాలక గృహస్థబాలుండు శాలివాహన నామాంకితుండు. ఆతని తల్లి సురూప. ఆపె తనసుతునత్యంత గౌరవంబునఁ బెనుచుకొనుచుండె. అజయ్య విక్రముండగు విక్రమార్కుండు దనయానుంగు సుతుని వధింపసమకట్టి, యరుదెంచు

చుండెనని, విని తనకుమారుని రక్షింపు ధీబలశాలు లెందును దనకుఁ జిక్కరుగదా యని వాపోవుచుండెను. ఇటులఁ బరి దేవనంబందుచుండఁ, దనభర్త వలసినచోఁ గోరినవెంటనే ప్రత్యక్షుండై, యెట్టి సంకటంబునేనిఁ దొలంగించెదనని, యొసంగిన వరంబు జ్ఞప్తికిరా, ధైర్యంబు వహించి, శ్రీకృష్ణభగవానుండు కంసుని వధియించినటులఁ దన బాలుండును దప్పక యారాజును సంహరింపఁ గలండను నమ్మకముతో, భర్త నారాధించెను. ఆతండు ప్రత్యక్షుండై, యాబాలునకుఁ బ్రాణప్రతిష్ఠామంత్రోపదేశం బొనరించి, యబ్బాలుండంతకుమున్నె సిద్ధపఱచిన మృత్తికాచతురంగబలంబును, సజీవంబుగా వించి వెడలెను. అనంతరంబా శాలివాహనుండు విక్రమార్కునాజి నెదుర్కొని, బాహాబాహి, కచాకచి, ముష్టీముష్టిఁదుములసమరం బొనరించి, దండతాడిత భుజంగంబువోలె, మహోగ్రరూపంబున రిపుసైన్యంబులఁ జెండాడుచుండెను. విక్రమార్కుండన్ననో మహాపౌరుషంబున యుద్ధంబొనరింపు చుండెను. కాని విక్రమార్కుని సైన్యంబంతయుఁ జెల్లాచెదరై, బలదర్పింతుండగు శాలివాహనుని సైన్యములచే సంహరింపఁబడెను. అంత విక్రమార్కుండు పరాజితుండగుట శాలివాహనుండు దయాపూర్వకంబుగ నొసంగిన వింధ్యాచలోత్తర భాగంబునకుఁ బాలనాధికార మొసంగెదనని యె. కాని విధిబలీయంబగుడు విక్రమార్కుండు రణస్థలి నసు

వులఁ దొలఁగెను. శాలివాహనుండు పట్టాభిషిక్తుండయి నిజనామంబున శకంబొండు వెలయించెను. అవియే యిప్పటికిని సుప్రసిద్ధంబుగఁ జెప్పఁబడుచుండు విక్రమార్క శాలివాహన శకములు.

## 2. ప్రతాపరుద్రుఁడు.



సకలకలా విరాజితంబయి, సజ్జన నిబిడీకృతంబయి, సర్వసస్యశ్యామల పరిశోభితంబయి, యక్షీణరక్షణోపాయ బాహుబల దర్పితంబయి, చండప్రచండదండకోదండమండనంబయి, యఖండ సామ్రాజ్యరమావిలసన్నటనానుకూల్యమయి, సత్ప్రవర్తనానుమోదసంభరితమై, తనరిన భరతఖండాంతర్గతంబగు నాంధ్రమహీమండలంబున మండనాయమానంబగు నోరుగల్లు, కాకతీయవంశ సుప్రఖ్యాతరాజధానియై, యొప్పినఁ గాలంబునఁ బట్టణంబుల యందలి యంగళ్ల శుద్ధమౌక్తికంబులును, వజ్రంబులును రాసులుగనుండెడివి. మణిమయాంచిత స్వర్ణవికృతింబులగు నాభరణంబులఁ బ్రతిగృహంబునను గమలాలయ తాండవము సల్పుచుండెడిది. అప్పురోపేత మానవులు నిత్యకల్యాణ శోభావతంసులు, వైభవోపేంద్రులు, కుబేరతుల్యులునై యుండిరి. అక్కాలంబునం దాంధ్రుల యౌన్నత్యమపారమయి, పాలనా సౌష్ఠవముం బడ

సి, యుచ్చదశనంది యుండెను.

క్రీ॥ శ॥ 1295 వ సం॥ ప్రాంతమునం దాంధ్రుల కీర్తి కాంతి, యోరుగంటిపురంబున శరదిందు సుందరంబై సానఁ బట్టినరత్నమువలె మెఱయుచుండుట, శత్రువులకుఁ గంటకం బుగఁ జూపట్టుచుండెను. ఈ యోరుగంటిని రాజధానిగఁ గా వించికొని, శత్రునిశ్శేషం బొనరించి, యఖండ ప్రఖ్యాతిని గాంచిన రుద్రమదేవి, నిజదౌహిత్రు రాజ్యభద్రుఁ గావించె ను. మాతామహీదత్త రాజ్యపరిపాలకుండగు ప్రతాపరుద్ర చక్రవర్తి యశోవిహారుండయి, పాలనం బొనరింపుచుఁ, దిరి లింగరాజ్య రమాధిదేవతను నలుదెసల విహరింపఁ జేసెను. అత్తఱి నీ ప్రతాపరుద్రుఁ గేవలమా ప్రతాపరుద్రుండేయని యనసాగిరి. ఆతని రాజ్యపాలనంబున జనులెల్లరు సకలసౌ ఖ్యంబులఁ బడసి, నిమ్మకు నీరెత్తినటుల హాయిగ సర్వసౌ ఖ్యంబులందుచుండిరి. అటులుండఁ బ్రతాపరుద్రుం డొకనాఁ డు కొలువుకూటమునకు వచ్చుటకు మున్నె, యాభవనమం తయు, నిసుకవైచిన రాలనటుల సభ్యులచే నిండియుండెను. రాజావలోకన తత్పరులయి జనులెల్లరు దమతమ యాసనం బుల నాసీనులై నాఁడు నిర్ణయింపఁ బడనున్న విషయంబులఁ గూర్చియు, నంతకుం బూర్వంబునఁ జరిగిన దుర్ణయనివారణ సాధనోపాయంబులఁ గూర్చియు నాత్రమునఁ దమలోఁ దా మాలోచించుకొనుచుండిరి. మఱికొంద ఱా దేశంబునందం

దుఁ దటస్థింపుచుండిన చోరాది దుష్కృత్యంబులఁ గూర్చి యుఁ, దన్నివావారణోపాయంబులఁ గూర్చియు, ముచ్చటించు కొనుచుండిరి. ఆ సమయంబున జయజయ నినాదంబులు బోరుకలంగ, వందిమాగధులు వెనుకఁ గైవారములు సలుపుచుండ, సకల సామంత భూపాలయుతుండయి, రాజాధిరాజ పదవీలాంఛనాంకితుండై, నిండు దర్పంబునఁ బ్రతాపరుద్ర చక్రవర్తి యోలగంబుఁ బ్రవేశింప, సభ్యులెచ్చటివారచ్చట నిలంబడి యంజులులు ఘటియింపుచుండ సింహాసనాసీనుండయ్యెను. ఇరుకెలంకుల నమర్పఁబడిన యాసనంబుల మంత్రిపుంగవు లలంకరించిరి. సభనిశ్శబ్దమయ్యెను. అంతఁ బ్రతాపరుద్రుండు నిజవాక్ప్రతాపంబు మెఱయ, సభ్యుల నవలోకించి, "సభ్యులారా! మంత్రిసామంతాద్యాప్త వర్గంబులారా! కాకతీయాంధ్ర రాజ్యధ్వజ మోరుగంటిపై, నృత్యము సల్పుచుండఁగనె, యాంధ్ర ప్రతాపాగ్ని శాత్రవ జాతంబుల హృదయంబులఁ "బ్రజ్వరిలు చుండఁగనె, బాహుపటిమగల యోధానుయోధులగు మీరందఱు విశ్వాసపాత్రులై, రాజ్యంబును రక్షింపుచుండఁగనె, మనరాజ్యంబునం దేనాఁడును గనివిని యెఱుంగని దారుణ కృత్యంబులద్భుతంబుగ నుద్భవింపు చుండెనని వినుట మిగుల విషాదకరము. తస్కరులు సర్వలింగేశ్వరాలయ ప్రవేశ మొనరించి, యాభరణంబులపహరించుటయు, మొన్న మొన్ననే యాకుల

చెంచయ్యాయను భూసురుని భవనంబునఁ జోరులు ప్రవేశించి, వానిని బ్రహరించి, నిధినిక్షేపంబులు హరించుటయు, వినియుంటిరిగదా! అక్కటా! యిట్టి విద్రోహంబు లేనాఁడైన ను వింటిమే! ముందెన్నఁడిట్టి చెట్టలాపాదిల్లకుండు నుపాయంబు లూహించి, రాజ్యంబునుగాపాడుట మీకెల్లరకుం బ్రథమ కర్తవ్యము" అని చక్రివర్తి పలుక నయ్యెడఁగల సామంతాప్త బంధుమిత్రవర్గంబేకగ్రీవంబుగ రాజాజ్ఞ మాలిందాల్చి మెలంగ సంసిద్ధంబుగ నున్నారమని, వాక్రుచ్చిరి. తన పూర్వపాలకుండగు గణపతిదేవ చక్రవర్తి రాజ్యంబునఁగల వివిధకులజాతులకు నాయకత్వం బొసంగుట నిట్టిచెట్టలు పుట్టఁ గారణంబయ్యెను. "బహునాయకత్వంబు భగ్నకారణంబు" అనెడి వాక్యము రిత్తవోఁజాలదనియు, మానధనులు, నీతిసంపన్నులు, విశ్వాసపాత్రులు, సుధీవిభవశాలులు నగు నుత్తమకులజులు నాయకత్వంబున కర్హులనియు, నా రాజచంద్రుండు పలికి, యచ్చటి సభ్యుల యనుమతిని, బద్మనాయకులకును, బంధువర్గంబునకును, విప్రతతికిని, నాయకత్వ మొసఁగి వారివారి కనువగు ఛత్రచామరాది బిరుదంబులొసంగి, వివిధ వస్త్రాభరణాదుల సత్కరించెను. మఱియు రాజ్యంబునఁ జెట్టిబాధలు కలుగకుండునట్టు లేర్పాటులఁ గావించెను. తస్కరబాధితుండైన భూసురుని జాయాసహితంబుగ రాఁబనిచి, దంపతీపూజసల్పి, దివ్యాభరణాదు

లోఁగి వారి భరణంబున కొక యగ్రహారంబు నొసంగెను. అదియే యిప్పటికిని సిరిపురమను పేరఁ బరఁగుచున్నది.

సామ్రాజ్యపరిపాలనము సామాన్యవిషయము కాదు. సాధారణ మానవులకుండు విచారముకంటె రాజునకే చింతలు మెండు. ఎంతటి శాంతిపరుండయిన, నెంతటి ధీవిశాలి యైన, నెంతటి పరాక్రమదురంధరుండయినను మహీపాలుండందఱ స్తోత్రములకుఁ బాత్రుండగుట, యసాధ్యము. సమయజ్ఞుఁడు కాఁడని కొందఱును, శిక్షింపనెడలఁ గఠినుండని మఱికొందఱును, దాక్షిణ్యముఁ జూపినచో నసమర్థుండని యింకఁ గొందఱును, న్యాయవిచారణా నైపుణ్య హీనుండని మఱికొందఱును, దలంచుట లోకనైసర్గికము. వీనినన్నిఁటిని బాగుగ గుర్తెఱింగి, శ్లాఘాపాత్రంబుగఁ బ్రజానురంజనముఁ జేసి పాలనం బొనరించువాఁడే రాజనామంబున కర్హుండు. ప్రజాపాలనంబున రుద్రమదేవిచేతను, శివదేవయ్యాభిధానామాత్యపుంగవుచేతను, శిక్షితుండైన ప్రతాపచంద్రనరేంద్రుండు, ధరాతలభారంబు వడసినదిమొదలు తనయక్షీణబాహుబలదక్షత నెఱయింపుచుండ, బాలుండను కారణంబున నరిమండలం బీతని భండనంబున నోడించి, స్వాతంత్ర్యంబు వడయ నూహించి, యుద్యోగమున సంసిద్ధమయ్యెను. మఱియొకదెస భరతఖండ సామ్రాజ్యంబు నంతమొందించి, యందలి హేమరత్నాద్యైశ్వర్యంబు లపహరింపఁ దఱి వేచియుండిన

యవనదేశజుండగు ఖిల్జీవంశాగ్రగణ్యుం డల్లాయుద్దీను సైనికనికాయంబులఁ జేర్చుకొని, యాంధ్రసామ్రాజ్యంబునొక్కమాఱుగ నాపోశనముం బట్ట సిద్ధముగనుండెను.

వర్తమానకాలంబున శూన్యంబయినను, బూర్వకాలంబున దేవబ్రాహ్మణసంసేవనా భక్తిపరులు, వైరివీరమారకులు, శరణాగతరక్షణదీక్షాదక్షులు, సత్యవాగ్భూషణులు భాషాపోషకులు, నగు కమ్మకులీనులు, పద్మనాయకులు మున్నగువారలు పెక్కండ్రాంధ్రశూరశిఖామణులు కేలఖడ్గంబులూని బాసట నిలిచి శత్రుప్రతాపాగ్నిరుద్రులై, ప్రళయచ్ఛటలం జిమ్మ, యేకశిలానగరంబును బగఱు తేఱిచూడరా నశక్యం బొనరింపఁ బగతురు దండతాడిత భుజంగంబుల వడువున, విజృంభించి యాంధ్రవీరవార ప్రతాపాగ్ని కింధనులయిరి. హతశేషులు వెనువెంటనే కాలికి బుద్ధిసెప్పఁ దొడంగిరి. ఆరీతిఁ దురుష్కుల ననేక దండయాత్రలఁ బరాజితులఁ గావించి, ప్రతాపరుద్రుండఖండ తేజోవిరాజితుండయి, విజయలక్ష్మిని బడసి యేకశిలానగర దుర్గంబుపైఁ గాకతీయాంధ్రపతాకఁ బ్రకాశింపఁ జేసెను.

ప్రతాపరుద్రచక్రవర్తి కాలంబునం దాంధ్రగీర్వాణభాష లసమానాభివృద్ధియందుండినటులఁ గన్పట్టుచుండెడిని. చక్రవర్తి గీర్వాణవాణిం బోషింపుచుండఁ దత్ప్రధానామాత్యశేఖరు లాంధ్రభాషాయోష నుద్ధరించి పెక్కం డాంధ్ర

కవి శిఖామణుల నాదరించిరి. ఆ రాజామాత్యులు పండితులు, రసజ్ఞులునగుటఁ దదాస్థానంబునఁ గవీశ్వరులు పండితులు బహుళంబుగా వెలసియుండిరి. విద్యానాథమహాకవి ప్రతాపరుద్రీయమను నలంకార గ్రంథమును రచియించి చక్రవర్తి కంకిత మొనరించెను. రుద్రభట్టను మఱియొక కవి సంస్కృతకర్ణాటభాషల బహుళ గ్రంథంబుల నిర్మించి మించిన సత్కారము లొందెను. త్రిపురాంతకుండు సంస్కృతాంధ్ర గ్రంథనిర్మాతయై బహుబహూకరణంబులఁ బడసెను. బుధజనస్తోత్రపాత్రుండగు తిక్కనసోమయాజికి శిష్యుఁడైన మారనకవి మార్కండేయపురాణము నాంధ్రీకరించి నాగయమంత్రికిఁ గృతినొసంగెను. భాస్కరకవి రామాయణమును, మంచనకవి కేయూరబాహుచరిత్రమును రచియించి, క్రమంబుగ సాహిణిమారుఁడు, గుండయామాత్యుఁడు నను సైన్యాధిపతుల కంకిత మొనర్చిరి. మొత్తముమీఁదఁ బ్రతాపరుద్రుని పాలనంబున సంస్కృతాంధ్రభాషావల్లరు లత్యంత వ్యాపకవృద్ధిఁ గాంచి, పుష్పించి, తద్భాషావధూటికి నేటికిని వాడని వీడని యలంకారములయ్యె నను టతిశయోక్తి కాదు. ఇందుఁ బైనఁబేర్కొనిన భాస్కరుఁడు, హుళక్కిభాస్కరుఁడను నామంబున వ్యవహరింపఁ బడుచుండెను. తత్కథనమప్రస్తుతమయ్యును బ్రస్తుత కాకపోదు కావున వివరించెద. ఈభాస్కరుని గృహనామము తొలుత మంగళంపల్లి

వారని తెలియవచ్చుచున్నది. ఈతండొక నాఁడొక రాజు మ్రోలనుండ రత్నఖచితపాత్రంబున నమూల్యాభరణ కవిత తాంబూలమిడి రసవత్కవితా ధురీణునకా విడియమొసఁగఁ బనుపన నాతండు తక్కినవారికన్న మిన్నఁగఁ గవిత్వముచెప్పి యావిడియంబుఁ గైకొనెనఁట. విడియమను శబ్దమునకు గర్ణాటభాషయందు హుళక్కియను పదము కలదఁట. తత్కారణంబునంజేసి నాఁడు మొదలాతం డానామమునే బిరుదముగాఁ గొని హుళక్కి భాస్కరుండనుపేర నొప్పియుండెను.

ప్రతాపరుద్రుండు కేవలము ప్రతాపరుద్రుండై, యనేకమాఱులు మహమ్మదీయ యోధులఁ జక్కాడి, యాంధ్రవీర వారసహాయభూతచేతస్కుండై, సమరంబున జయలక్ష్మిని స్వీకరించి, రాజ్యలక్ష్మిని సంతసంబునఁ బోషించుచుఁ గవి పోషకుండై యొప్పి ప్రజానాకర్షింపం బనేక సుప్రఖ్యాత సంస్థల నెలకొల్పి రాజుపగిది విరాజిల్లుచుండె. అంత నసతికాలంబున నాకస్మికంబుగ నల్లాయుద్దీను ఁడాంధ్రపరాభావానల దందహ్యమానసుండై విచారకోపాధపూరిత హృదయుండై పగసాధించి యాంధ్రప్రతాపభానుఁ గబళింప సమకట్టి యాకస్మికముగ రాహువువలె బీదరు మార్గమును ముట్టడించి పశముఁ గావించుకొనియెను. ఇంత త్వరలో మహమ్మదీయులు మఱల ముట్టడింతురని ప్రతాప

రుద్రుఁడు తలంచియుండలేదు. అంతకుఁ బూర్వము జరిగిన యుద్ధములయందు సైనికులు విస్తారముగా మడిసియుండుట చేత నాతని సైన్యము సిద్ధముగా లేకుండెను. రాజ్యములోని పద్మనాయక వెలమ, కమ్మ, కాపు, రెడ్లకు సంతతికల హంబులు మెండుగనుండెను. కాని వారందఱు రాజభక్తియుతులై నిష్కళంకహృదయులై యుండిరి. తురుష్కుల రాక వినినంతఁ జక్రవర్తి సేనానాయకుల నెల్లర నొక్కచోఁ జేరఁజీరి "యోధాగ్రేసరులారా! దండనాయకులారా! చమూపతులారా! నిన్నఁగాక మొన్ననే మనవలనఁ బరాభూతుండైన ముష్కర తురుష్కుండగు తుఘ్లఖ్ మఱల మనపై దాడి వెడలె. పాషాణమును భక్షించు పావురమునకు రత్నములభించిన గతిని, దటాకాంతరవర్తియగు బకంబునకు మానస సరోవరవిహారము ప్రాప్తించిన విధంబున నాతురుష్కునకు ఢిల్లీసామ్రాజ్యము లభియించుటంజేసి మన్నుమిన్నెఱుంగక వర్తింపుచుండెను. మీరందఱింతకు మున్నే యుద్ధమొనరించి యలసి యుంటిరి. సైనికులా సిద్ధముగ లేరు. అరిమండలమా యత్యధికముగ నుండెను. త్రిలింగసామ్రాజ్యము నెవ్విధంబునైన హరింపఁ దురకలు దీక్షవహించియుండిరి. ప్రతిక్షణికాచరిత సమరంబులో నీ ముష్కరుల నెంతవఱకని యెదుర్కొన గలుగుదుము! ఈమా రాంధ్రరాజ్యమొ, తురుష్కుల ప్రాబల్యమొ యంత

మంది తీరవలెను. కంఠంబులం బ్రాణంబు లున్నంతవఱ కరి కంఠలుంఠనంబొనరింపుటయే ముఖ్య కర్తవ్యము" అని హెచ్చరింప నావాక్యముల కాశనారశిఖామణులంద ఱేకగ్రీవంబున బొందెల నసువులుండినంతవఱకు నేకశిలానగరంబున శత్రువులపాదంబుల మోపనీయము. స్వాభిమానావేశులమై దేశాభిమాన పూరిత హృదయులమై కాపాడుదు మని సప్రమాణంబుగం బలికి రాజభక్తి నెల్లడించిరి. వేర్వేఱదండనాయకులు సామంతభూపాలురు మంత్రులాది సమస్త బంధుమిత్ర వర్గంబులు తమతమ శౌర్యప్రతాపంబు లుగ్గడించి రాజ్యరక్షణబద్ధకంకణులై చక్రవర్తికి నమ్మకము గలుగునటుల వచియింప నాతండు వారివారి శౌర్య ప్రతాపంబులకు మెచ్చి యుద్ధ ప్రయత్నంబులం గావింప నానతిచ్చి యప్రమత్తులై శత్రువుల యాగమనంబు నిరీక్షించుచుండునటుల నాజ్ఞాపించెను.

అంతం దురుష్కులేకశిలానగర దుర్గంబును జుట్టుముట్టిరి. ఆనగర దుర్గరక్షణార్థై యన్నమదేవశ్రీరంగదేవాది మహావీరబలులు పురమారున నైనం జొరనశక్యముగు తెల్లింగునం గాచుచుండం దురుష్కస్కంధావారములోనం బ్రవేశింప శక్యముగామి ననేకశతఘ్నులం గొల్పిరి. ఆధరి సైనికులాసావరంగంబునం గటికి యస్త్రశస్త్రాద్యనేకాయుధ ధారులై ప్రాణంబులనాశం దొలంగి రిపుల మర్దింపు

చుండిరి. రేనాఁటి సంగమనాయకుఁడు మున్నగు జోదులు చెల రేఁగి ప్రళయకాల సర్పమ్మని చూడ్కి గర్జించుచు నెదురైన తురుష్కవీరుల నిజనిశిత శస్త్రాస్త్రంబుల విగతప్రాణులఁ గావించుచు వీరవిక్రమ విహారంబు సలుపఁదొడఁగిరి. తొలుదొల్త మహమ్మదీయులాంధ్ర సైన్యంబుల ధాటికి తాళఁజాలక వెన్నిడఁ దొడంగిరి. కాని యులూఘ్ఖాను హెచ్చరిక వాక్యంబుల మహమ్మదీయ సైనికులు ద్విగుణితోత్సాహులై యుద్రేకించి యనిమొనసరుల సంహారము సేయుచుండిరి. దుర్గకుడ్యంబులు కూలఁ దొడంగెను. ఆంధ్రుల ధైర్యకవచంబులు సడలఁజొచ్చెను. క్రమంగ సామ్రాజ్యలక్ష్మి యాంధ్రులఁబాయు సమయ మాసన్నమాయెను. ప్రతాపరుద్రుడు కాలరుద్రుమదుగ్రుఁడై సమరావని వీరవిహారము సల్పుచు నిజసైనికుల నెంతో ప్రోత్సాహించినను శౌర్యహీనులై వైరివీరుల శరానలంబున శలభాయమానులైరి. మహమ్మదీయ యోధులు రణరంగంబున విజృంభించి ప్రతాపరుద్రుని బాధించిరి. అదియే యాంధ్రసామ్రాజ్య పతనమునకుఁ బ్రారంభము. విజయలక్ష్మీ లోలురైన మహమ్మదీయు లేకశిలానగరంబున స్వేచ్ఛావిహారులైరి. ఆహా! కాల మనిర్వచనీయము. భగవత్సంకల్పమును దప్పింప నెవరి శక్యము! లక్ష్మి చంచల స్వభావగదా! భుజశక్తి యార్తభయశోక వర్తిగాగ విద్యానాథ కవిపుంగవుల పోషణము భూషణము గాగ

నౌదార్యవిభవమర్థి దారిద్ర్య దావాగ్ని కసర్గళవృష్టిఁగాగ రాజ్యరమాకళత్రుఁడై సంస్తవపాత్రుఁడై యాంధ్రఁ సామ్రా జ్యనిరంకుశశాసనుఁడై యఖండ వైభవోపేతుండై శివారాధ నాతత్పరుండై భక్తచూడావతంసుఁడైన ప్రతాపరుద్ర మహీ చంద్రుఁడు ముష్కర తురుష్కకర్కశపాశబద్ధుఁడయ్యెను. అనేక కవివరార్థిజనకల్ప భూరుహమై విలసిల్లిన నాంధ్ర సామ్రాజ్య మస్తమించెను. ఆంధ్రవీర పరాక్రమాది సద్గు ణౌఘము లస్తమించినవి. ప్రతాపరుద్రుండటుల బంధింపఁ బడి ఢిల్లీకిఁ గొంపోబడెను.

## —మంత్రి యుగంధరుఁడు.—

యుగంధరుండను మంత్రి ప్రతాపరుద్రునొద్ద నమా త్యుఁడై యుండి నటులఁ జరిత్రములయందెచ్చటను జూపట్ట కున్నను బ్రతాపరుద్రుని మంత్రిపుంగవులలో నేరికోయొక రికీయుగంధరుండను బిరుదము లభించియుండవచ్చును. ఇ య్యది పౌరుషనామమై యుండనోపు. యుగంధరుండు పూ ర్వము వత్సరాజుల యాస్థానమున మంత్రిగా నుండినటులఁ దెలియవచ్చుచుండెను. ప్రతాపరుద్రు నాస్థానంబున యుగం ధరుండను మంత్రియుండినటులఁ దెలియవచ్చుచున్నది. ఈ మంత్రిపుంగవునిఁగూర్చి చెప్పెడికథలు నీతిదాయకములనుట నిస్సంశయము.

అటుల నులూఫ్ఖానను నాతఁ డాంధ్రదేశముపై దం డెత్తి మాయోపాయంబునఁ బ్రతాపరుద్రుని ఢిల్లీకి ఖైదీగాఁ గొంపోవ రాజకుటుంబమే కాక తద్దేశజులుగూడ భయాతురులై దురపిల్లసాగిరి. అంత రాజభక్తిపరాయణుఁడు, దేశభక్తిపూరితహృదయుఁడు, నకలంకపూతచారిత్రుఁడు నైనయుగంధరుండు, రాజకుటుంబమునకును బ్రజలకు నభయం బొసంగి, దేశమునందలి యులజడుల మాన్పి రాజ్యమరాజకము గాకుండ నొనరించి, శత్రువులఁ బాఱఁదోలి, తా నాఱు మాసములలో పునరాజుం దెచ్చి, సింహాసనాసీనుం గావింపని నాఁడు దేశభ్రష్టుండగుదునని ఘోరశపథమూని యిలు వెడలెను. ఘామశకటంబులు లేని యుత్తరప్రత్యుత్తరములు నడవని యాకాలంబున నదులుదాఁటి, వనములుగడచి, యూరులమించి, దేశంబు లతిక్రమించి, కాలినడక నొంటిమై గమ్యస్థానంబగు ఢిల్లీపత్తనముఁ బ్రవేశించెను.

అచట యుగంధరమంత్రి ప్రచ్ఛన్నవేషుండయి గుప్తనాముండయి యున్మత్తరూపంబు వడసి జీర్ణవస్త్రంబుల మృణ్మయ పాత్రశకలంబులఁ, బాత్రచర్మంబుల గై సేసి యొడలఁ బూదిఁబూసికొని "ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్ ఆరేనెలలకుఁ బట్టుకపోతాఁ" అనెడి పిచ్చివాక్యంబులతో వీధుల వెంట నడయాడుచుండెను. ఇతఁడు పిచ్చివాఁడని భ్రమియించి చప్పటలు చఱచుచుఁ, రేకలు వైచుచుఁ గొట్టుచుఁ దిట్టుచు వెం

టాడించు బాలుర హేళన వాక్యంబులకు సమాధాన మొసంగుచుఁ దనలోఁ దానే మాట్లాడికొనుచుఁ దన్నుఁగొట్టవచ్చిన వారిని జేతి కందినపుడుఁ గొట్టుచు బహుభంగులఁ బ్రేలుచు, నవ్వుచు, మతిభ్రష్టుని గతిసంచరింపుచుండెను. తత్పురవాసులందఱీతండుపిచ్చివాఁడనియే తలంచిరి. అందుచే నాతనికిఁ బోరానిస్థలములు గాని వినరాని మాటలుగాని లేకుండెను. వచ్చిపోయెడివారితో రాజసభ కెట్టి యాటంకములు లేకయే వెళ్లివచ్చు చుండెను. అచటి ప్రభువులు తమకుఁ దీరికయైనపుడు వానిఁ జెంతకుం బిల్చి వానిపిచ్చి మాటల కానందించెడివారు. పిచ్చివాఁడని భ్రమియించుటంజేసి వాని యెదుటనే రహస్యంబుల వెల్లడించెడివారు. ఆతఁడు పిచ్చివాఁడో లేక రహస్యంబుల నెఱుంగ నిట్టి రూపమునుదాల్చిన నేరాజకీయవేత్తయో యని సందియమంది, రాజొకనాఁడాతనిజాడ గుర్తించి తెలిసికొనిరాఁ గొందఱు భటుల నియోగించెను. ఆతఁ డనుదినంబును బగటిపూటల వీధులందందు సంచరించి, జనులందఱు నిద్రించిన పిదప నిశలయందూరివెలుపల శ్మశాన భూములకుఁ జని యచటి జలాశయంబున స్నానంబొనరించి యొక్కెడఁ బొయి నేర్పఱచి తానూరినుండి తెచ్చికొనిన మృణ్మయ పాత్రయందు బియ్యముఁబోసి వంటఁజేసికొని భుజింపుచుండెడివాఁడు. అటుల రాజభటులు వెంటాడించిననాఁడుగూడ మామూలు పద్ధతి ననుసరించి

వంటఁజేసికొనుచుండగా రాజభటులు యుగంధరునకుఁ దెలి యకుండ నొక వృక్షాగ్రముపైఁ గూర్చుండిరి. అప్పుడాతని కావులింతవచ్చెను. వింతలేని యావులింత యుండదను శాస్త్రమెఱింగిన వాఁడగుటంజేసి యుగంధరుండు వెంటనే "గుడగుడ శబ్దము కుండకు నష్టము" అని యాకుండను బ్రద్దలుగొట్టి బొంతగంతఁ దగిలించుకొని యొచటికో వెడలెను. దీనిని నంతయు నా రాజభటులు చూచి యాతఁడు నిశ్చయముగాఁ బిచ్చివాఁడనియే తలంచి రాజునకు నివేదించిరి. అది మొదలా రాజ సభయందు నిరభ్యంతరముగ నాతనికిఁ బ్రవేశము లభ్యమయ్యెను. సభలోనివారే దేని విషయమును బ్రసంగింపుచుండ యుగంధరుండు శ్రద్ధతో దాని నాలకింపుచుఁ దనయుద్యమ సాధనము లరయుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు యమునానదీతటంబునం దొక యోడ విడిసెను. అందు రత్నములు వజ్రములు మున్నగు వెలగల పదార్థములుండెను. అందలి వర్తకులు పట్టణములోని రత్నవర్తకులకుం దమరత్నములను గెంపులను జూపి రాజ సముఖమునకుం జనిరి. వెల పొడుగుగల యాతాల, తేఁడు గాంచి వానింగొనఁ దలంచెను. అంత వర్తకులు తేని యభిప్రాయము గ్రహించి తమ యోడకడకు వచ్చి, రత్నపుసరకును బరీక్షింపఁ గోర నా తేఁడు పరీక్షాదక్షుండగు ప్రతాపరుద్రుని వెంటఁగొని యోడనెక్కెను. వారల నా సమయం

టాడించు బాలుర హేళన వాక్యంబులకు సమాధాన మొసంగుచుఁ దనలోఁ దానే మాట్లాడికొనుచుఁ దన్నుఁగొట్టవచ్చిన వారిని జేతి కందినపుడుఁ గొట్టుచు బహుభంగులఁ బ్రేలుచు, నవ్వుచు, మతిభ్రష్టుని గతిసంచరింపుచుండెను. తత్పురవాసులంద ఱీతండుపిచ్చివాఁడనియే తలంచిరి. అందుచేనాతనికిఁ బోరానిస్థలములు గాని వినరాని మాటలుగాని లేకుండెను. వచ్చిపోయెడివారితో రాజసభకెట్టి యాటంకములు లేకయే వెళ్లివచ్చు చుండెను. అచటి ప్రభువులు తమకుఁ దీరికయైనపుడు వానిఁ జెంతకుం బిల్చి వానిపిచ్చి మాటల కానందించెడివారు. పిచ్చివాఁడని భ్రమియించుటం జేసి వాని యెదుటనే రహస్యంబుల వెల్లడించెడివారు. ఆతఁడు పిచ్చివాఁడో లేక రహస్యంబుల నెఱుంగ నిట్టి రూపమునుదాల్చిన నేరాజకీయవేత్తయో యని సందియమంది, రాజొక నాఁడాతనిజాడ గుర్తించి తెలిసికొనిరాఁ గొందఱ భటుల నియోగించెను. ఆతఁ డనుదినంబును బగటిపూటల వీధులందందు సంచరించి, జనులందఱు నిద్రించిన పిదప నిశలయందూరి వెలుపల శ్మశాన భూములకుఁ జని యచటి జలాశయంబున స్నానంబొనరించి యొక్కెడఁ బ్రొయి నేర్పఱచి తానూరినుండి తెచ్చికొనిన మృణ్మయ పాత్రయందు బియ్యముఁబోసి వంటఁజేసికొని భుజింపుచుండెడివాఁడు. అటుల రాజభటులు వెంటాడించిననాఁడుగూడ మామూలు పద్ధతి ననుసరించి

వంటఁజేసికొనుచుండగా రాజభటులు యుగంధరునకుఁ దెలి యకుండ నొక వృక్షాగ్రముపైఁ గూర్చుండిరి. అప్పుడాతని కావులింతవచ్చెను. వింతలేని యావులింత యుడదను శా స్త్రమెఱింగిన వాఁడగుటంజేసి యుగంధరుండు వెంటనే "గుడగుడ శబ్దము కుండకు నష్టము" అని యాకుండను బ్ర ద్దలుగొట్టి బొంతగంతఁ దగిల్చికొని మొచటికో వెడలెను. దీనిని నంతయు నా రాజభటులు చూచి యాతఁడు నిశ్చయ ముగాఁ బిచ్చివాఁడనియే తలంచి రాజునకు నివేదించిరి. అది మొదలా రాజ సభయందు నిరభ్యంతరముగ నాతనికిఁ బ్రవే శములభ్యమయ్యెను. సభలోనివారేదేని విషయమును బ్రసం గింపుచుండ యుగంధరుండు శ్రద్ధతో దాని నాలకింపుచుఁ దనయుద్యమ సాధనము లరయుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు యమునానదీతటంబునం దొక యోడ విడిసెను. అందు రత్నములు వజ్రములు మున్నగు వెలగల పదార్థములుండెను. అందలి వర్తకులు పట్టణములో ని రత్నవర్తకులకుం దమరత్నములను గెంపులను జూపి రాజ సముఖమునకుం జనిరి. వెల పొడుగుగల యాతాల, ఱేఁడు గాంచి వానింగొనఁ దలంచెను. అంత వర్తకులు ఱేని యభి ప్రాయము గ్రహించి తమ యోడకడకు వచ్చి, రత్నపుసర కును బరీక్షింపఁ గోర నా ఱేఁడు పరీక్షాదక్షుండగు ప్రతాప రుద్రుని వెంటఁగొని యోడనెక్కెను. వారల నా సమయం

బునఁ బిచ్చివాఁడు గూడ వెంటాడించెను. ఆతని నెవరు నా టంకపఱుపరైరి. వారందఱత్తఱినోడ సమీపించి లోని కిం జని రత్నములఁ బరీక్షించు చుండిరి. అదియే యదనని యోడఁబయనము సాగింప యుగధరుం డుత్తరువు సేసెను. ఓడ రేవువదలి పోవుచుండెను. కొంతకాలంబగుడు నోడ పై భాగమునకులూఫ్ఖాను వచ్చిచూడ నా ప్రదేశమంతయు నాతనికి నూతనముగఁ గన్పట్టెను. అప్పుడారాజు వర్తకులఁ బిలిచి యిప్పుడెచ్చట నుంటిమని యడుగఁ బిచ్చివాఁడు నిజ రూపమును ధరించి తాను బ్రతాపరుద్ర మహారాజు మంత్రి యగు యుగంధరుండననియు దనరాజును గపటోపాయంబు న బంధించి కొని తెచ్చి నందుల కై తానును కపటోపాయంబు ననే మహామ్మదీయ ప్రభువగు నాతని ఖైదీగాఁ దన దేశం బునకుఁ గొనిపోవుచుంటిననియు దర్పంబు మెఱయ వచి యించెను. అంతరాజు కంపితగాత్రుండై చైతన్య రహితుండ య్యెను. యుగధరుండు వానిని భయమంద వలదనియు వా నికెట్టి యవమానమును గావింప ననియుఁ బలికి ప్రతాపరు ద్రు నుచితవస్త్రాలంకార సమన్వితుఁ గావించి, మకుటభూషి తు నొనరించి ఢిల్లీచక్రవర్తినుచితగౌరవమున నాదరించి యోరుగంటికిం గొనిపోయి యా ప్రభుద్వయమును గజా రూఢులఁ గావించి యూరేగించి సింహాసనంబునఁ బ్రతాప రుద్రుని వెలయించి పట్టాభిషిక్తుగా నొనర్చెను. ఢిల్లీచక్రవర్తి

కిఁ బెక్కు విధములగు గాన్కలిడి స్వదేశమున కనిచెను. తాను గావించిన సమయానుసారముగ రాజుం దెచ్చి డిల్లీచక్రవర్తిని గూడ రప్పించిన యాతని సామర్థ్యము ననేక విధముల బ్రజలు గొనియాడిరి. ఇట్టి నిష్కల్మషచిత్తులు రాజకీయవేత్తలు దేశభక్తి పూరితస్వాంతులు ప్రభుభక్తి తత్పరులుస్వార్థత్యాగులు గల యేదేశము నే భూమిాశుండు నభివృద్ధిఁ బొందించి సుభిక్షముగ వెలయింపకుండును? ఈ మహారాజకీయ కళానిపుణుని చరితమగణ్యము పవిత్రవంతము పురుషాకారము ధరించిన మూర్తివంతము ననుట కావంతయు సందియములేదు. ఈతని యద్భుతమేధా సంపత్తిఁ దలంచినంతమాత్రాన శరీర ముప్పొంగకమానదు. ఇట్టివినిర్మల రాజభక్తి, దేశభక్తి, సర్వాలహృదయంబుల నెలకొని భరతవర్షమభివృద్ధిఁబడయుఁ గాక.

# 3. భీమసేనుఁడు.



పాండవులు ధార్తరాష్ట్రాదులవలనఁ బునర్ద్యూతంబున నైత మోటువడి తన్నిబంధనానుసారంబున మునిరూపధారులై వన్యఫలాహారంబులఁ గాలంబు పుచ్చుచు బ్రహ్మచర్యదీక్షనూని కాననంబుల ద్వాదశవర్షంబులు

గుప్తమ్మరి జనపదంబుల నన్యులకుఁ గోచరంబుగాకుండఁ త్రయోదశ వర్షంబునఁ బోవ సమకట్టి విదురానుమతిని మాతృదేవతయగు గొంతిని గృహంబునందునిచి భీష్మద్రోణాదుల కెఱిగి వారి మన్ననలంది భోగంబులఁ ద్యజించి పురమువాసి చనిరి. అటుల వెడలుచున్న పాండవేయుల వెంట ముక్తకేశియై వెడలుచుండిన ద్రుపదాత్మజను బౌరవధూగణ మవలోకించి శోకానలతప్త మానసమయ్యెను. శోకరోష క్రోధానల దహ్యమాన మానసులగు పాంచాలీయుత ,పాండవులు వనవాసంబునకుఁ జనుచుండునపుడు ధర్మజుండు నిజరూక్షావలోకన జనదాహభీతి వదనంబు గప్పికొని వాయుసుతుండు సమరావని శత్రుమదము సదమదముఁగావింపు సమయమే తెంచెనని దెల్పుటకోయన బాహువుల వ్రేలాడవైచియు ఫల్గునుండు పగఱ భస్మీపటలంబిసుమున మేళవింపఁ జేయఁ జాలుదునని సూచింపుటకోయన నిసుమెత్తి చల్లుచును నకులుండు నిజసుందర వదనాలోకంబునఁ బౌరలోకంబు విచార గ్రసితంబగునని తనయనిష్టము వెలువరించుటకోయన ధూళిధూసరితాంగుఁడగుచును సహదేవుండు తన కోమలవదన మొరులకు దుఃఖభాజనముగఁ గన్పట్టునను వెఱపున సమ్రవదనుండగుచును ద్రౌపది ధార్తరాష్ట్రి భామాభావిదుఃఖ సూచనగ శిరోజంబులఁ జిందఱ వందఱ గావింపుచును యామ్యాదిశారణ్య భాగంబులకు వెడలిరి.

అటులా పాండునందనులు ద్రౌపదీయుతులై కాన నాంతరంబుల సంచరించి యొరులకుం గానరాకుండునటుల నూరువల్లెలకు దూరంబుగ విహరింపఁ జనుచుఁ దమ శస్త్రంబులం బొదివి విరాటనగరంబునకుఁ జేరువనున్న యడవిలోని శమీవృక్ష శాఖాంతరంబునం దన్యులకుఁ గన్పట్టకుండునటుల భద్రంబుగా నుంచిరి ఆయా యరణ్య ప్రదేశంబుల ద్వాదశ వర్షంబులు గడపి విరట్పురాభిముఖులై యజ్ఞాతవాసంబు నడుపఁదొడంగిరి. అటు లజ్ఞాతవాసంబు నడుపుటకుచితంబగు వర్తనలకనువగు నామంబులఁ గుదుర్చుకొని సమీపస్థ నదీజలంబులఁ గ్రుంకులిడిరి. అంత ధర్మజుండు .తనతండ్రియగు ధర్మజుండలంప నాతనికి వెంటనే యోగిరూపము లభించెను. భీమాదులకును ద్రౌపదికిని వారువారు గోరుకొనిన నామములకనువగు రూపములలవడెను. తదుచిత పరివర్తనాదుల కనుకూలములగు వస్త్రాభరణాదులు లభింప వానిఁ దానలంకరించికొని యనుజులను ద్రుపదాత్మజను వెనుకరా నియోగించి ధర్మజుండు ముందు విరటుని కొలువుకూటమున కేగెను.

యతిరూపంబున దవ్వులనుండి యే తెంచుచుండిన నామహారాజచూడామణిని విరటుండుగాంచి యెదురేగి రాజ్యరమను బాలింపఁ దగినసీతని భుజయుగంబేలకో దండ కమండలంబుల వహించెనని యక్కజమంది యాతనికి నమ

స్కరించి యర్ఘ్యపాద్యంబులఁ బూజించి యాతిథ్యమొ సంగి యాగమనకారణంబడుగఁ దానుగంకుభట్టాభిధా నుండ ననియు ధర్మజు మంత్రిననియు వైరివీరుల మాయా ద్యూతమునందోడి యొకవత్సరకాల మన్యులకుఁ దెలియ కుండునటుల సాధుసజ్జన మహీపాలుండగు నాతనిచెంత వసింప నేతెంచితిననియు ధర్మజుండు వచియించెను. అందు లకు మత్స్యభూపాలుండగు విరటుండాత్మనలరి యాతనియభి మతమున కనుమతించి తనగద్దెనాతఁడే యధివసించి పాలిం పుచుఁ గాలంబు గడుపుమనియె. తాను రాజ్యపాలనాను కూలుండఁ గాననియు నియమితానుసరణి భూతల శయనుం డగుచుఁ బ్రొద్దుఁబుచ్చఁ దలఁచినవానికి రాజ్యపాలనం బేల యని పలుక నమ్మహీపాలుండాతని యభీష్టంబున కిష్టపడి యెను. ఆరీతిని ధర్మజుండు కంకుభట్టాభిఖ్య మెలంగుచు నాభూపాలుని మన్ననకుఁ బాత్రుండై యాతనికొలువున ముఖ్యసభ్యుండై మెలంగుచుండెను. పదంపడి వివిధమా ర్గంబుల భీమార్జున నకులసహదేవులా మత్స్యభూపాలు నాస్థానంబునకుంజని వరుసక్రమంబున వలలాంకబృహన్నల దామగ్రంధి తంత్రీపాలనామంబులం దెలిపి యచ్చోటఁ దా మొనరింపు పనుల నెఱింగించి యొక్క వత్సరమందుండు నటుల విరట్రాజు ననుమంతింపఁగోరిరి. వారల రూపసౌం దర్యాతి విభవంబులకు విరటుండు మనంబునందాశ్చర్యపడి

వారు ఘోరకాననాంతరంబుల నిట్టి రూపధారులై యుందు రని యూహించి వారివారి చిత్తవృత్తుల ననుసరించి మెలంగవచ్చునన వలలాంకుఁడు సూపాధ్యక్షుండుగను పేడియైన క్రీడి తన్నరపాలసుతయగు నుత్తరకు నృత్యాభినయాది కళల నెఱింగించు బోధకుండుగను దామగ్రంథి యశ్వశాలాధ్యక్షుండుగను కడగొట్టువాఁడగు తంత్రీపాలుండు గవాధిపతిగను నియమింపబడి యతినైపుణ్యం బగపఱచుచుఁ దమ తమ నియమిత కృత్యంబులం దప్రమత్తులై యాభూవల్లభుని సేవింపుచుండిరి. పాండవపత్నియగు పాంచాలరాజతనూజ విరాట్పుర రాజవీధులఁబడి వచ్చుచుండఁ రాజపత్నియగు సుధేష్ణ యాపరిచారిక రూపధారిణిని నిజసౌధోపరిభాగంబు నుండి తిలకించి యాపె సౌందర్యమున కెంతయు సంతసించి నెచ్చెలులంబనిచి యాపెఁ గొనిరానాజ్ఞాపింప వారలరిగి యామెం దెచ్చి తమ దేవేరికడ నిల్పిరి. ఆదేవి యామె నెవ్వరిదాన వెచటికేగుచుంటివని పలుక "అమ్మా! నేను మున్ను దుప్రదరాజాత్మయగు ద్రౌపదిచెంతఁ గొంతకాలము సేవకురాలనై యాపెమనస్సున కెక్కునటుల వర్తించి స్తోత్రపాత్రినైతిని. నేను సైరంధ్రీవంశ సంజాతను. పేరు మాలిని. నీచకార్యంబులొనరింపను. పరోచ్ఛిష్టంబులం గుడువను. నీవు సుగుణగణమణివని విని యొక్కింతకాలము నిన్ను సేవింపఁదలంచి వచ్చితిని. నా నియమానుసరణి మెలంగ

నీయకొనినచోఁ గుసుమములఁగూర్చి గంధానులేపనంబుల
సమకూర్చెదను. నన్ను నీయెడ నుండనీకొంటివేని నేనిచట
నుండెద"నని పాంచాలరాజతనూభవ వలుక సుధేష్ణమనం
బునందలరి యాపెను దనచెంతనుండ నంగీకరించెను. అటు
లాపాండవ పంచకంబు సతీయుతంబుగ విరటునిపురంబునఁ
గొన్నిదివసంబులు గడువుగ వత్సరంబుగడప నొక్కనాఁడు
సుధేష్ణాసహోదరుండు మత్స్యభూపాల సేనానాయకుండు
కీచక నామాంకితుండునగు దుష్టుండొకండు సమరాంగణం
బున శత్రువుల నురుమాడి జయంబుగాంచి నిజసోదరికి
నమస్కరింప నంతఃపురము ప్రవేశించెను. అచట రాణి ని
కటంబున రమామణి నొకరితంగాంచి మదనశర పీడితుండై
తనయక్క తాయక్క కెఱింగింప నాపె యాతని యుద్దే
శంబున కెన్నియో విఘ్నంబు లాపాదించెను. ఎన్ని చెప్పినను
గీచకుండు వినక సోదరి పాదంబులకు మ్రొక్కి యయ్యంగ
నామణి పొత్తులభింపని నాఁడు దానసువులఁ బాసెదనని పరి
పరిభంగుల బ్రతిమాల, సోదరుపై మక్కువగొలంది నాతని
పలుకులఁ ద్రోసివేయంజాలక సమ్మతించి యమ్మదవతి నాత
ని సదనమున కనిపెదనని చెప్పి పనిచెను. ఆకీచకునిదుర్వృత్తి
నాపాంచాలి గ్రహించి యచ్చోటువాసి చనుచుండ నమ్మా
నవాధముండు గృహోన్ముఖుండై యరుదెంచుచు మార్గ
మధ్యంబున నమ్మానినీమణింగాంచి నిజమనోభిప్రాయంబెఱిం

గింప నాపె వానికి సముచితవినయోక్తుల నీతిపథంబులుప దేశించెను. కాని యువియున్నియు వానిచెంగట బూతిం గలసె. ఆతం డంతటితో విడువక బలిమిమై నామెను బట్టు టకుఁ బ్రయత్నింప నాయమ కోపారుణిత లోచనయై

శా॥ దుర్వారోద్యమ బాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీరనిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవురిప్పుడు నినుదోర్లీలన్ వెసన్గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముల్ గొనుటతథ్యంబెమ్మెయిన్
[గీచకా॥

యనిపలుక నాతండు నిర్లక్ష్యభావంబు సూచింపుచు నిలుసేరి . యెపుడుప్రొద్దుగ్రుంకునా యెపుడుసంజవడునా యని యాపెరాకకువిశ్లేషారుచుండెను. అంత సాయంకాల మగుటచే నచట సుధేష్ణ మదిరాపానాయత్తచిత్తయైనటుల నటించి సోదరగృహంబునంగల సురందెచ్చి తన తృష్ణను దీర్పుమని ద్రౌపదినిబిలిచి తెలుప నందులకామె యియ్యం గొనక తన్నటకుం బంపవలదని పలుతెఱగుల విన్నవించు కొనియెను. కాని యధికారపూరితయగు నారాణి కీచక గృహంబునకుంజని మధువుఁ గొనిరాక తప్పదని నిర్బంధింప దాస్యశృంఖలాబద్ధయగు నాద్రౌపది యేలికయానం దోసి వేయంజాలక యెట్టకేలకుఁ దనమానరక్షణ భారంబా క మాధి నాథునందునిచి కీచకభవనంబునకుఁ బోవసమకట్టెను.

అంత నాయమ తొట్రిలుపాదములతో భయకంపిత గాత్రంబుతో భగవన్నామోచ్చారణంబుతో సర్వసాక్షియగు నాభాస్కర భగవానుని స్మరియించుచు

గీ॥ పాండుపుత్రులకేను ద ♦ ప్పని మనంబు
గలుగుదానని యేని యో ♦ కమలమిత్ర!
కీచకుని దెసనాకొక ♦ కీడు తెలవు
వారయకుండంగ రక్షింపు ♦ కరుణతోడ॥

అని ప్రార్థింప నాలోకబాంధవుండామె సతీత్వమున కెట్టిహానియు రాకుండఁగాపాడ నొక్కయసురునంప నాతం డదృశ్యాకారంబున నక్కోమలి వెంట నంటియుండెను. అంతట నయ్యువిద బెబ్బులిపొదఁజొచ్చు కురంగంబువడువున నాకీచకుని గృహంబుఁజేరి తానువచ్చినపని నెఱింగించి వైళ మమదిరారసంబొసంగి పంపఁగోరెను. కాని "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునటుల నాపాపాత్ముండు మదిరారసంబన్యులచేఁ దనసోదరి కంపెదననుచుఁ దమకించి యాపైపైఁబడ నాయమఁగావవచ్చినరాక్షసుండాసబలంబా పెశరీరంబునందావిర్భవించియుండుటచే నబలయైనను దిటవ్రాని యాతని విదల్చికొని చెంగుచెంగునఁ బఱువెత్తుచు విరటరాజుకొలువున కనతి సామీప్యమునుండి పోవుచుండ నద్దనుజాధముండాడలు దెలియక గోవుపైలంఘించు వ్యాఘ్రింబుకరణి నత్తలోదరిని వెంటాడెను. అత్తరుణంబున నయ్యెడఁగల భీమసేనుండా

దుష్టుని గీటడంప( దలంచెను. కాని యుధిష్ఠిర నివారితుండ
గుడు విముఖుండయ్యె. అంతనాద్రౌపది దీనానయై సుధేష్ణ
పాలికింజని కీచకుని దురాగతంబెరింగింప దానికిం దగినశిక్ష(
గావించెదనని యాపెనామె నూఱడించెను.

కాని యానాటిరేయి ద్రౌపది కూర్కనేఱుంగదు.
తన్నవమానపఱుప నెంచిన నద్దురాత్ము నెప్పగిదినైన( బరి
భవింపుదనుక నాపెమనసునకూఱట యెట్లుసంభవించును? ఆ
నా(డర్ధరాత్రంబున(దిన్న(గ వృకోదరరునినిలయంబునకుంజని
కీచకుండు తనకొనరించిన యెగ్గును భీమున కెఱింగించి యా
దుండగీని యసువుల మెసవకున్న( దానసువులబాయనిశ్చ
యించిన నాతండు ద్రౌపదినూరార్చి మఱునా(డంతఃపురం
బున కరుదెంచు కీచకునికోరిక( దీర్చునటుల నటించి నమ్మించి
దివాభాగంబున బృహన్నల నివసించు నర్తనశాల సాంకేతిక
స్థలంబుగ నిర్ణయించి యచ్చోటునకు మఱునా(టిరేయి
రా(బలికిన పిదప నడచువృత్తాంత మెఱుంగ(గలవని చెప్పి
యనిచెను.

మదనోన్మాదుండగు కీచకుండు ద్రౌపదిచే నావార్త
విని యంతవఱకెట్లులనో మనంబును బిగియంబట్టి నిజసోదరీ
యంతఃపురప్రాంగణంబు చేరి, రెట్టించిన మదోద్రేకంబున,
నా పెంగవయనుంకింప నాపె ధైర్యంబుతో నిలిచి, యా
నా(టిరాత్రి నర్తనశాలకుంజనుదెంచిన కోరిక( దీర్చెదనని

యాతని సమ్మతింపఁజేయు, నాతండు సంతుష్టాంతరంగుండై గృహంబునకుంజని, నాఁడెంతకును సంజవడునట్టు లాతనికిం దోఁప మిగులఁ గుద్ధుఁడై భాస్కరుని నిందింపుచు, నెట్టకేటుల నో గడిపి నిశాసమయంబున నిజమనోరథసిద్ధికై హాలాయుల గులుకనొంటిమై నర్తనశాలను సమీపించి,

ఉ॥ స్వాంతము బాహుగర్వమున ♦ సంతమసాంద్రముగాగ, [శంకయొ
క్కింతయులేక కీచకుఁడ♦హంకృతిముంగలిగాగ మండపా
భ్యంతరభూమిఁజొచ్చితటి ♦ యంజని, యారసిసెజ్జఁ [గాంచి యు
త్యంతము దావహంబగుదు ♦ నందురయంబునఁ గేలుసా
చినన్”

అంతకుమున్నె భీమపరాక్రమదర్పితుండగు భీముఁడ చ్చటి పర్యంకము నలంకరించి, వేడుకఁజూడ ద్రౌపదిని రహస్యప్రదేశంబునందొక చో నుండనియమించి, యుద్దేశంబున సింహబలు నంతంబుఁగావింప వేఁచియుండెను. అంత నప్పాప వర్తనుండాకాళరాత్రి యానర్తనశాలంజేరి, పర్యంకశయుత వ్యక్తి ద్రౌపదిగా భావించి, సమీపించి హస్తస్పర్శనంబుఁ గావింప భీముం డుదగ్రక్రోధుండై లేచి యన్నీచాధముని దల పట్టి వంచెను. ఆ నిశాచరుండా గంధర్వుని నేలంబడఁ ద్రోసి దండతాడిత భుజంగంబువడువున బిట్టలుకగదుర

శతు్రినెదుర్కొని పోరాడంజొచ్చెను. అంతవారివురుమల్ల యుద్ధంబు సలిపిరి. భీముండు కీచకునితోఁబోరి చంపి, వీనుం గు నొకముద్దగ నొనరించి, కాలుసేతులఁ గలయంగట్టె ద్రౌపది కాకీచకుని యవస్థ నెఱింగించి యాపె మదికి సంత సంబుగూర్చి యంతఃపురమున కనిచి యా శవంబు నొక మూలవైచి, తాను శయనాగారంబునకుఁజేరి యేమియు నె ఱుంగనివానివలెఁ బరుండెను.

దుర్వృవర్తనుండగు సింహబలుండంతటితో నంతమొం ది తనదు పాపఫలమనుభవించెను. దురాత్ములకుఁ జేటు మూఁడుట సహజంబుగదా! యౌవనంబున మన్నుమిన్నెఱుం గక యుక్తాయుక్తంబులరయక సంచరించు దుర్నీతిపరులు కీచకునివలెనే ఖేదవిషాదంబులఁ బొరయుదురు.

బలము గలిగినందుల కున్మత్తతఁ జరింపక నిజ బల ముపయోగించి, పరోపకార పారీణుండై యేజనుండు వర్తించునో యాతండే ధన్యతముండు. భీమసేనుండు భీమబ లుండయ్యు, నిజబలంబును వమ్మొనర్పక మనుజాహారియై యనవరతమేకచక్రిపురవాసులఁ బీడించు బకాసురునిగీట డంచియు, దుష్ప్రివర్తనుండయి పరనారీమానాపహారణము నకై యత్నించి దుర్వ్యాపారనిమగ్నుండయిన కీచకుని బోన డంచియు, వనమునఁ గీమసల్ప లోనెంచి రౌద్రావేశుండై పైఁబడ నుద్యోగించిన హిడింబుని బిల్కుమార్చియు, ము

న్నగు బహుళోపకారములొనరించి శాశ్వతానందము గూర్చుటకై వినియోగించి, జనుల హృదయపీఠంబుల స్థిరని వాసంబు సేసికొనియె. బలమొప్పినందులకు ధీబలమున మేళ వించి దుష్టుల సంహారించి కీర్తి విహారులై విద్యార్థి లోకం బు వెలయుఁగాక.

## 4 గోపరాజు రామప్రధాని.



గోపరాజు రామప్రధాని యనునాతండు శాలివాహ నశకము 1060వ సం॥నకు సరియగు హూణశకము 1145 వ సంవత్సరమనఁగా భీమకవికి సమకాలికుఁడై యుండినటులఁ జరిత్రాధారములు గన్పట్టుచుండెను.

ఈతఁడారువేల నియోగి బ్రాహ్మణుఁడు. గజపతి వంశ సంజాతుండగు గణపతిదేవు నాస్థానంబున నమాత్య పదవి నధిష్ఠించి స్వామిభక్తి పరాయణుండై యొప్పెను. అతఁడు స్వదేశ, స్వమత, స్వకులాభిమానియై తన్నువేడవ చ్చినవారి కుచితసత్కారంబులొనరించి యనుపుచుండెను. ఆతఁడొనర్చిన సేవకొకనాఁడు ప్రభువెదమెచ్చి యేదియేని వరముఁగోరు మిచ్చెదనన స్వదేశాభిమానియు స్వకులో

ద్ధరణ తత్పరుండును దీర్ఘాలోచనా పరుండును నయిన రామప్రధాని యప్పుడెద్దియుఁగోరక ముందుఁ దానువలసినప్పుడుఁ గోరెదననియు నప్పుడొక గంటకాలము రాజముద్రికఁ దన కొసఁగుమనియుఁ బ్రార్థింప రాజందులకంగీకరించెను.

అక్కాలంబున బ్రాహ్మణులు వృత్తులులేనివారై కడు దారిద్ర్యావస్థయందుండెడివారు. వారలు దమకుటుంబ భరణమునకుం జెందు కటకటలంగాంచి రామప్రధాని యాపేద పాఱులకేదేని వృత్తిఁ గల్పించి వారల పేదఱికంబువాఁపఁదఱి వేచియుండెను. గ్రామకరణీకము లాకాలంబునఁ గమసాలుల వశంబున నుండెడివి. వారివలన సకాలంబునవలసిన కార్యంబులు నెఱవేఱుట కష్టముగనుండెడిది. ఈయుద్యోగములఁ గమసాలులనుండి తొలంగించి నిజకులజుల కొసఁగ నెంచి రామప్రధాని యొకనాఁటి సూర్యగ్రహణకాలంబున గణపతి ప్రభువువలనఁ దాఁ గొంతభూమిని దానంబుగ గ్రహించెను. ఇటులుండ నొకదివసంబున వేములవాడ భీమకవి యాతనికడ కేగ నాతని రామప్రధాని మిగుల గౌరవపురస్సరంబుగ సమ్మానించెను. ఆ భీమకవి రామయామాత్యుని జూసి.

సీ॥ వీఁడెపో దుష్టారి ♦ వీరమంత్రికఠోర,
భూధరంబులకు దం ♦ భోళిధార
వీఁడెపో కవిరాజ ♦ గాఢదారిద్ర్యాంధ
కారంబులడఁగించు ♦ కమలహితుఁడు

వీఁడెపోబహుసీతి ♦ విద్యానిగూఢచే
సురగురుఁ గెల్చిన ♦ శుభకరుండు
వీఁడెపోఁజతురబ్ధి ♦ వేష్టితావనిఁగల్గు
బహుమంత్రికులసార్వ ♦ భౌమమూర్తి.
గీ॥ ఈతఁడేసర్వదేవతా ♦ ప్రీతికరుఁడు
ఈతఁడేగోపరాట్కుల ♦ శీతభానుఁ
డని కవీంద్రులుపొగడంగ ♦ నతిశయిల్లె
మంత్రిజంభారి రామయా ♦ మాత్యశౌరి

అని వినుతింప నాతఁడెంతయుఁ గవినిమెచ్చి, యతని సేవించి, శిష్యుఁడై కవితాసంపత్తిఁ బడసెను. ఇటులుండ నొకదివసంబున భీమకవి రామమంత్రింజీరి వృత్తిరాహిత్యులై దారిద్ర్యపీడితులుగ నుండిన ద్విజసంతతి నుద్ధరింపుమన నాతఁడు వల్లెయని తాను పూర్వము గణపతి ప్రభువునొద్దఁ బడసినవరము ప్రకారమాప్రభువు నాదినంబునఁగోరి రాజముద్రికఁ బడసి, యానాఁడాఱువేలగ్రామముల కరణీకముల కుఁ బట్టాల వ్రాయించి సిద్ధముగనునిచి యా పట్టాలపై మొహరుల వైచి విప్రులరావించి గ్రహణసమయగృహీత దానక్షేత్రంబునంతయు నాకరణీకములకు మాన్యక్షేత్రంబుగ నొసఁగిఁ యా నిర్ణీతఘంటికా కాలంబునందాఱువేల పట్టాలను, స్వకులజులకిడి జాత్యభిమానముం జూపెను. నాఁడు మొదలాకరణీకములకు నియమింపఁబడిన వారందఱాఱువేల

నియోగులని వ్యవహరింపబడుచుండిరి. అప్పటి భీమకవి తన మదిలోని సంతసముఁ బట్టఁజాలక

సీ॥ తనకీర్తియాచంద్ర ♦ తారార్కముగ మంత్రి
కులులకుఁ గరణీక ♦ ములనొసంగి
యతిథిసంతర్పణ ♦ మనుదినంబునొనర్చి
ఖ్యాతిగా హరిహర ♦ ప్రీతిఁ జేసి
వర్ణాశ్రమాచార ♦ నిర్ణయంబుల నెల్ల
వేదోక్తరీతిగా ♦ వెలయఁ జేసి
ఘనవిప్రవందిమా ♦ గధకవీంద్రుల నెల్ల
నగ్రహారములిచ్చి ♦ యాదరించె.
గీ॥ నతఁడు శ్రీగోపరాజన్వ ♦ యాబ్ధిచంద్రుఁ
డనఁగవిలసిల్లెఁ దనసాటి ♦ ఘనులువొగడ
మంత్రి దేవేంద్రుఁడనఁగ స్వ ♦ తంత్రలీల
మంత్రికుల హేళి రామయా ♦ మాత్యమౌళి॥

అని రచియించి నుతియించెను. రామయామాత్యుని కాలమునాఁటికిఁకాలమునందుఁబలె నియోగ వైదిక భేద ముండినటులఁ గన్పట్టకుండెను. రామప్రిధాని యల్లుండు దుర్వ్యాపారలోలుండై పిత్రార్జితంబుల నెల్లఁగోల్పోయి పురోహితవృత్తిఁ గాలముఁగడపుచుండినటుల నీక్రిందికథవలనఁ దెలియనగును. రామప్రధాని యొకనాఁడు గార్యాంతరంబుల నాందోళికారూఢుండై యేగుచుండ, వానితనూజాత

యొక్కెడమూసివాయనము గ్రహించి యొడలెల్లఁ బసపుఁ బూసికొని భుజమున బియ్యపుమూటతో వచ్చుచుఁ దన కెదు రయ్యెనఁట. ఆపె నిజజనకునిగాంచి లజ్జించి యొక తాళఫల వృక్షపుమాటున నొదిగినిలఁబడ నాతం డాపెంగాంచి, కరం బెదంజింతించి, నాఁడు మొదలు స్వకులసంజాతులకు శాశ్వత వృత్తులఁ గల్పింపఁ గృతనిశ్చయుండై నటుల యొక గాథగల దు. ఏదియెట్లున్నను గరణీకములన్నియుఁ గమసాలులనుండి తొలఁగింపఁబడి బ్రాహ్మణుల వశము గావింపఁబడెను. దానం జేసి రామప్రధాని స్వకులోద్ధారణుఁడనియు స్వజాత్యభి మానియనియు స్మరింపకమానదు.

ఇట్టికులాభిమానము, జాత్యభిమానము, దేశాభిమానము బ్రతివ్యక్తికిని హృదయంబునఁ బ్రభవించియుండెనేని దేశ మౌన్నత్యదశనంది యుండెడిది. కాని స్వార్థాభిలాషులు కొం దఱు దేశద్రోహులై సన్మానంబుల బిరుదంబుల కాశించి పాపభీతివీడి చరియించుటం జేసి దేశమధోగతికి రాఁగల్గెఁగాని దేశసౌభాగ్యమే నిజసౌభాగ్యముగ నెంచి స్వదేశీయులే సోద రులుగ భావించి, దేశక్షేమమే యాత్మక్షేమముగ భావించి స్వకులోద్ధరణమే స్వజనోద్ధరణంబని యూహించి వర్తించిన మేధానిధి రామయామాత్య మహాశయునిగతిఁ బూర్వము మనవారలు సంచరించియుండిరేని మన యౌన్నత్యమునకు మేర లేకుండెడిది. ఇమ్మహాశయుననుకరించు కులాభిమానులు, దేశాభిమానులు స్వార్థత్యాగులు పెక్కండ్రు భారతభూమిని వెలయుదురుగాక.

---

# ౫ ఖడ్గతిక్కన.



ఖడ్గతిక్కనకే రణతిక్కనయను నామాంతరము కలదు. తండ్రి సిద్ధయ. తల్లి మైలమ. పెంపుడుతల్లి పోలమ. పోలమకుఁ బోలనయను మఱియొక కుమారుఁడుండెను. ఆ యన్నదమ్ములిరువురసమాన పరాక్రమోపేతులై మనుమ సిద్ధిరాజు నాస్థానంబున మంత్రులుగను దండనాథులుగ నుండి మిగులఁ బ్రసిద్ధిఁబడసిరి. భారతాంతర్గత విరాట్పర్వాది యష్టాదశపర్వములనుక రచియించిన తిక్కనసోమయాజి ఖడ్గతిక్కనకుఁ బితృవ్యకుమారుఁడు. ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంభ సూత్రుఁడు. ఎఱ్ఱగడ్డపాడను పట్టణమున మనుమసిద్ధి భూపాలునకును కాటమరాజునకును యుద్ధము సంభవించెను. ఈయుద్ధమునందే ఖడ్గతిక్కన ప్రాణములఁ గోల్పోయెను.

కాటమరాజు తన పశువులను మనుమసిద్ధిరాజు బీళ్లయందు మేయునట్లుగను దానికిఁగాను దాను గొంత పుల్లరి నిచ్చునట్లుగను నేర్పఱచికొని మేపించుకొనుచుండెను. ఇటులఁ గొండొకకాలంబునం దొకనాఁడు కాటమరాజు వృషభమొండెచటకోఁ బోవ నయ్యది మనుమసిద్ధి భూపాలుని పశుగణంబునందుండెననియు దానినిమ్మనియు వర్తమానిం

చెను. కాని వాస్తవముగ నాయొద్దఁదులేమి వాని పశుపాల కులా నశ్రుం దామెఱుంగమనుటచే నాప్రభుండు కుపిత చిత్తుండై యెత్తిరా రణతిక్కన సైన్యపరీవృతుండై రణావనిఁ జేరెను. అయినను గాటమరాజు సైన్యం బధికంబగుడు నా తని ధాటికోర్వఁజాలక యాతఁడు స్వసైన్యముగఁ జెల్లాచెద రై గృహోన్ముఖుండయ్యెను. భీమకవి రణతిక్కనకుఁ బితృభగినీ కుమారుఁడగుటచే బంధుదర్శనార్థమత్తఱి నచ్చ టికి వచ్చియుండెను. రణతిక్కన యుద్ధమొనర్పమాని యిం టికిఁ బాఱివచ్చెనని యెల్లరు గ్రహించి యాగ్రహావేశులై యుండిరి. తిక్కన స్నానార్థము పెరటిగుమ్మముకడకరుగ నంతకుమున్నె యాతనిభార్య యొకపాత్రితో నుష్ణోదకము నుంచి దానికడ్డముగ నొక నులకమంచము నందుపై నొక పసపుముద్దయు నుంచెను. వానింగాంచి తిక్కన స్త్రీలకు వలెఁ దనకుఁ బసపాదిగాఁగల పదార్థములేల నునిచితివన నాచెంత నేనిలఁబడిన తిక్కన మాతృదేవత తిక్కనవినునటుల

"క॥ పగఱకు వెన్నిచ్చినచో
నగరే నినుమగతనంపు ♦ నాయకులెందున్
ముగురాఁడు వారమైతిమి
వగపేటికి జలకమాడ ♦ వచ్చినచోటన్॥"

అని సమాధాన మిచ్చెనఁట. ఆపద్యమును భీమకవి విని "నీతల్లియు నీభార్యయు నాఁడువాంద్రు. నీతోఁగలసి

ముప్పూరెరి. సంగ్రామ మొనర్పఁజాలక మగిడివచ్చిన మను జుండు స్త్రీతుల్యుఁడే" యని సమాధాన మొసఁగెనఁట. అచ టినుండి యింటిలోనికి భోజనార్థ మరుగ భోజనసమయ మునఁ దిక్కనతల్లి వానికి విఱిగిపోయిన పాలు వడ్డించి "నీవు వెడలినచోటికే మనపసుసమూహ్మా యమూహార సంచయార్థ మరిగినవి. నీవు వఱిఁగివచ్చినటులనే యవియు విఱిఁగివచ్చినవి. పాలును విఱిగెను. నేనేమి చేయగలను" అని పలుక భార్యయొనర్చిన యవమా నమునకే గుందుచుండ "గోటుచుట్టుపై రోకటి పోటు"ను నటుల తల్లివాక్యములకు మఱియుఁ గుపితుఁడై యుండ భీమ కవి ప్రస్తావనా వశమున

"క॥ అసదృశముగ నటపసుల
మసిపుచ్చకి విఱిఁగివచ్చ • మగపంద కిరియన్
గనవున్ మేయఁగఁ బోయిన
పసులున్ విఱిఁగినవి తిక్క • పాలున్ విఱిఁగెన్॥

అనినుడివి ప్రజ్వలనాగ్నికింధన సంధానుకరణి వాని కోపాగ్నిఁ బ్రజ్వలింపఁజేసెను. అంతఁ దిక్కన పీరావేశుండై భుజియింపుటమాని లేచి యుద్ధ సన్నద్ధుండై రణావనికింజని యసహాయశూరుండయి కాటమరాజుతోఁ బోరాడి శత్రు వీరశతఘ్ని కాహుతుండై వీరస్వర్గ మలంకరించెను. రణ తిక్కనంబోలిన ధైర్యశౌర్యోపేతులును, భక్తిగేసితులును

సరకుసేయక యుద్ధమొనర్పఁ బ్రోత్సాహ మొసంగినట్టి తిక్క నభార్యంబోలు వీరపత్నులును, కన్నపుత్త్రునిపైఁ గరుణవీడి పౌరుషవచనంబులు వలికి యని మొనకనిచిన ఖడ్గతిక్కన తల్లి కైనయగు వీరమాతలును భరతమాతృ గర్భంబునఁ బొడమి దేశ మున్నతస్థితికిం దెత్తురుగాక. సమరరంగంబున నసువులఁబాసిన తిక్కనను గూర్చి భీమకవి యిట్లని కీర్తించెను.

చ॥ పదటునవాజిరాహుతులపైదుమికించుఁ దిక్కఁడార్చినన్
బెదరిపరిభ్రమించి కడుఁబిమ్మటవీరులు భీతచిత్తులై
యదె? యిదె!వాలువాల్మొఱఁగులల్లవె? యాతఁడంచినన్
గొదుకక యాజిసేసె రిపుకోటులకందఱకన్నిరూపులై.

ఉ॥ చిక్కకమన్మసిద్ధివిభుచే మునుగొన్న ఋణంబుఁదీర్చెమా
తిక్కనమంత్రి సోమశిల దేవరసాక్షిగఁ బెన్నసాక్షిగా
నెక్కినవాజిసాక్షిగ మహీన్నుతికెక్కిన కీర్తిసాక్షిగా
స్రుక్కకమారుకొన్న రణశూరులు సాక్షిగఁ గొండ
[సాక్షిగన్॥"

ఏనాఁడు హైందవకుటుంబంబులనిట్టి వీరపురుషాగ్రగణ్యులు వీరనారీమ తల్లులు, వీరమాతలు, వెలయుదురో, యానాఁడే దేశ మున్నతపదవికి రాఁగలుగుటకు సందియము లేదు. అట్టి సుదినములు లభ్యమగుగాక.

సాధారణమయిన యొక యుబల యాకాలమున నోరుగంటికి వెడలుట సులభసాధ్యము కాదని తోఁచుటచేతను బెద్దాపురపు సంస్థానాధీశుండు భీమకవియనిన గుండె బెదరు కల వాఁడై యాతనిఁ దఱచుగ నాహ్వానించి బహూకరించి యుండుటచేఁ బెద్దాపురము గోదావరీ మండలమునకు సంబంధించి యుండుటచేతను భీమకవి యొనర్చిన సప్తసప్తాహము గోదావరీతీరంబు నంటుకొనియుండుటచేతను యోరుగంటికి సమీపంబున గోదావరీ నది లేమిం జేసియు భీమకవి గోదావరీ మండలస్థంబగు ద్రాక్షారామమున కీశాన్యమూలయందుఁ గలవేములవాడ నివాసియని స్థిరపడఁగలదు.

ఈ కథానాయకుఁడు శాలివాహన శకము 1020 వ సం॥న కెనయగు హూణశకము 1098 వ సం॥న జనియించి నటు లూహింపనగును. కొందఱు చరిత్రకారులు 12 వ శతాబ్దమనియు మఱికొందఱు 13 వ శతాబ్దమనియు నింక కొందఱు 14 వ శతాబ్దమనియు నభిప్రాయపడుచుండిరి. కాని పదునొకండవ శతాబ్దమనుట కాధారములు మెండుగాఁ గలవు. భీమకవికృతి రాఘవపాండవీయమును నన్నయభట్టు నశింపఁజేయ భీమకవి కినుకమై నన్నయభట్టారక కవి రచితాంధ్ర శబ్దచింతామణియను వ్యాకరణమును గోదావరీ నదింగలిపినటులును దత్ప్రచనకాలంబునందే సారంగధరుండు వల్లించిన కారణంబున వ్యాప్తినొందినదనియు నప్పకవి తన

గ్రంథంబున వ్రాసియుండుటంబట్టి భీమకవి నన్నయభట్టునకు సమకాలికుఁ డనుట స్పష్టము. నన్నయ విరచితాంధ్రభారతము రాజరాజ నరేంద్రాంకితమగుటచే నా మహీపాలునకును సమకాలికుఁడేగదా! ఆ భూపాలుండు క్రీస్తుశకము 1077 వ సంవత్సర ప్రాంతంబున జీవించియుండినటులఁ జరిత్ర లుదహరింపుచుండెను. భీమకవిశాపానల రూపుండయి పునఃరాజ్య ప్రాప్తుండైన రాజకళింగగంగు శాలివాహన శకము 1040 కి సరియగు పూరాణశకము 1110 వ వత్సర ప్రాంతమువాఁడయినటుల శిలాశాసనాధారములుండుటంబట్టియు శ్రీనాథుని కాశీఖండమందలి.

"సీ॥ వచియింతు వేముల ♦ వాడ భీమనభంగి
నుద్దండలీల నొ ♦ క్కొక్కమాటు
భాషింతు నన్నయ ♦ భట్టు మార్గంబున
నుభయభాషాప్రౌఢి ♦ నొక్కమాటు
వాక్రుత్తుఁదిక్కయ ♦ జ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధముగ ♦ నొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ ♦ పరమేశ్వరు తెఱవ
సూక్తివైచిత్రి ♦ నొక్కమాటు

*          *          *          *          *

యను నంశమునుబట్టి యాతఁడు కవిత్రయంబునకును శ్రీనాధునకును బూర్వపువాఁడని తెలియుచున్నది. కా

వున నీతఁడు 11,12 శతాబ్దములనడుమ జీవించియుండె ననుట స్పష్టము.

## జననవృత్తాంతము.

గోదావరీమండల ప్రాంతస్థంబగు వేములవాడయందు దిరవుఁగావించికొని సోమనాథారాధ్యుండను గృహస్థుఁ డొకఁడుండె. ఆతం డాఱువేల నియోగిబ్రాహ్మణుండు. నిరంతర దైవధ్యానతత్పరుండును సాధుసత్ప్రవర్తనుండునై పితార్జితక్షేత్రజీవనుండై వెలయుచుండె. అప్పటి యాచారానుసరణి భార్యాపంచకంబును బడసి జీవయాత్రఁ గావించుచుండెను. సంతానరాహిత్య సంతాపమున వగలఁ బొగులుచుఁ దత్ఫలాభిలాషి యగుటంజేసి యతండు బహుళతీర్థాటనలసల్పి బహుదేవతల నారాధించుచుండెను. కాని సంతానముమాత్రము బడయఁజాలకుండెను. అటు లుండ నొకనాఁటిరేయి దేవుండు స్వప్నంబున సాక్షాత్కరించి యాతని జీవితానంతరంబునందు భువనవిఖ్యాతుండగు పుత్త్రుఁడుదయించునని వచియించెనఁట. అంత నాసోమనాథుండు సంతానకాంక్ష వదలి బహుకాలమిహలోక సుఖంబు నవ్వారిగా ననుభవించి పరమపదమలంకరించెను. అనంతరము గతభర్తృకలగు నాతని భార్యాపంచకంబు స్వాతంత్ర్యంబుఁ బడసి తీర్థయాత్రలొనరించుచుఁ దమయిచ్చవచ్చిన స్థలం

బుల వీక్షింపుచుండిరి. అందుఁ గడపటిపెండ్లము మహాలక్ష్మి యనునామె కడు నవమాయకురాలును ప్రాపంచకజ్ఞాన రహితయు ముగ్ధరాలునై యుండెను.

వేములవాడ కనతిదూరంబునఁగల ద్రాక్షారామ భీమేశ్వరునకుఁ బ్రతివత్సరము మాఘశుద్ధ పూర్ణిమనాఁడ త్యుత్సాహకరంబగు నుత్సవంబొండు జరుపఁబడుచుండు అటులుండ శాలివాహనశకము 1019 కెనయగు క్షయనామసం॥ మాఘ శు॥ పూర్ణిమా భృగువాసరంబున నీద్రాక్షారామ భీమేశ్వరుని యుత్సవంబు వీక్షింపఁ బలుతావుల నుండి యసంఖ్యాకంబుగఁ బ్రజలు వెడలుచుండ నాఁడు వేములవాడనుండి యీ విగతభర్తృపంచకముగూడ వెడలెను. అందు మహాలక్ష్మి యమాయకురాలగుటఁ దక్కినవారలామెను లాఘవముగఁ జూచుచుండిరి. ఆతీర్థమునాఁడు వారందఱచటి సప్తగోదావరియందుఁ గ్రుంకులిడి యిష్టదైవతంబగు నాభీమేశు నారాధించి యభీష్టంబు నొసంగఁ బ్రార్థించిరి. అందుఁ గొందఱు సువాసినులు తముకుఁ బుత్త్రసంతానము ర్థింపఁ బూర్వసువాసినియగు మాచమ్మ ప్రపంచజ్ఞాన విరహితయగుటఁ జేసి తనకుఁగూడ నొక కుమారు నొసంగఁగోర నచటి సధవలం పలుకు లాలకించి విధవలు సంతాన కాంక్షలగుట విచిత్రకరమనియు, నాకోర్కె నెరవేఱుట యసంభవమనియు, నపూర్వమనియుఁ బలికిరి. మహా

లక్ష్మిన్న వారిమాటలకలుక వహించి దేవుండు పక్షపాత ర హితుండనియుఁ బిపీలికాది బ్రహ్మపర్యంతముఁగల సృష్టి కోటి నాతఁడు సమానదయ నాదరించుననియు నట్టి నిష్ప క్షపాతుండగు భగవంతుండు దనకుమాత్రి మేలనోసంగఁ డనియు వచియించి తనకుంకూడ నొక్కనిసుంగు నొసంగఁ గోరెను. తక్కంగల యువతులుకుమార సహితలయిరో కా కుండిరోకాని మాచమ్మమాత్రము భవేశ్వరానుగ్రహంబునఁ బ్రభవ సం॥ శ్రావణ శు ౫ మీా భృగువాసరంబునకు సరి యగు క్రీ॥ శ॥ 1012 వ సంవత్సరమునం దాగస్టు నెలలో నొక చక్కనికుమారుని బ్రసవించెను. ఆతఁడే మనకథానా యకుఁ డయిన భీమకవి.

అంతనీవార్త నాలించిన లోకు లాశ్చర్య చకితమాన సులై బహుభంగుల వచియింపుకొనుచుండిరి. వెండియు మహాలక్ష్మిన్న యొక్క బంధుబృందము లాపెయందు నేరమా రోపించి కుపితమానసులై నాపె కులభ్రష్టయని నిందించి వె లివైచిరి. ఋజుమార్గానువర్తినియగు మాచమ్మదన్నెవ్వరే మనినను లక్ష్యముసేయక ధైర్యము వహించి నిజసుతపోషణ మా భీమేశ్వరుపై నిడియుండెను. ఆ బాలుండును శుక్లపక్ష సుధాంశుభంగి దినదినాభివృద్ధిఁ గాంచుచుండెను. సవతులు మున్నగునాప్తకోటి మాచమ్మను గులదూరఁగాఁ జేసి సిలు గులందఁజేసినను నాపె యిసుమంతయుఁ జలింపక యాపర

మేశ్వర ధ్యాన నిమగ్నమానసయై పుత్త్రినతిభద్రముగఁ గాపాడుకొనుచు నతిగారాబమునఁ బోషించుచుండెను. ఆ బాలుండటుల దశవర్షప్రాయుండయి సంగాతికాండ్రంగలసి క్రీడాభిరాముండయి కాలముపుచ్చుచుండెనే గాని విద్యాభ్యాసమావంతయు నొనర్పకుండెను. దృఢకాయుండగు నిబ్బాలుండు నేస్తకాండ్రయందు మొనగాడయి ప్రతివిషయంబునందాతఁడే గెల్పొందుచుండెను. ఆ కారణంబునం దాయూరి బాలురాతని నొకప్పుడుఁ బరిహసింపఁ దలఁచి యాతనిఁగవియు భీమాకారుండగు భీమన వారినందఱఁ దానొక్కండే మర్దింప నాతనిం జేయునదిలేక రండాపుత్త్రుండనియు, గోళకుండనియు, మున్నగువాక్యంబుల నాతని దూషింపనాగిరి. పెక్కండ్రు బాలకులు తమతండ్రులకడ కేగ వాంఛితంబుల నందుచుండఁ దనకట్టిభాగ్యములేమిఁ దోడిబాలకులు దన్నాడెడి నిందావాక్యంబులు దలంచి రోషకలితమానసుండయి యచటఁగల పెద్దఱాతి నొకదాని నెత్తికొనిపోయి తల్లిని సమీపించి యా పెఱరాయిచేతను గొట్టసాహసించి తన్నూరివారలందఱుఁ బలుకందగినఁ గారణము చెప్పుమనియుఁ, దనజనకుండుగల తావెఱింగింపుమనియు, లేని నాఁడా పెఱరాయి ప్రయోగింతుననియుఁ బలికెను. ఆ యమయా పాపని నయవాక్యంబుల శాంతపఱిచి తన్నడిగినటుల దాక్షారామ భీమేశ్వరుని జేర యడుగుమన నాతండు వెం

టనే దాక్షారామమునకుంజని దేవళంబునంగల భీమేశ్వర ప్రతిమాసన్నిధి నిలిచి తనతల్లిని ప్రశ్నించినవిధంబునఁ బ్రశ్నింప సమాధానము వడయంజాలమి నా లింగమూర్తిని సహస్రఖండంబులు గావింతునని పలుక భీమేశ్వరుండు ప్రత్యక్షుండయి యాబాలు నాగ్రహ విముక్తుం జేసి యనుగ్రహంబు గదుర నిట్లు లాసతిచ్చెను. "ఓయీ! నీవస్మదీయ యక్షీణ దాక్షిణ్య విశేషజనిత ప్రసాదుండవు. భవదీయమాత నిష్కళంకచారిత్ర. ఈవిషయ మెఱుంగని మూఢులాపెను నిందించి కులమున వెలిజేసినంతమాత్రంబున నాపె మాతృదేవతా పరమార్థమున కెట్టికళంకము నొదవంజాలదు."అని విన్నవించి యుండ వేఱులేని యాతనికిఁ దానేయంగమై యుపనయనాది సంస్కారంబు లొండవునటులను లోకంబునందప్రతిహత వాగ్విలాస చేతస్కుండై యనన్యసామాన్య లబ్ధకవితాధురంధరుండయి శివపూజా తత్పరుండయి సకలభూప సభాంతరాళసమ్మానితుండగునటులను వరంబులొసంగి యంతర్థానుండయ్యెను. భీమేశ్వర వరప్రసాదుండగుటం జేసి నాఁడు మొదలా బాలుఁడా దేవుని నామమునే ధరించి వ్యవరించుకొను చుండెను.

భీమేశ్వర కరుణాకటాక్ష లబ్ధమనోహర కవిత్వసంపన్నుండయిన భీమకవి భీమేశ్వరు ననేకవిధముల స్తోత్రంబులొనరించి గృహంబునకు వగిడి మాతృవందనం బాచరించి

దేవళంబునజరిగిన సమాచారంబు విన్నవింప నాయుమ యతికౌతూహలాయత్తచిత్తుఁడై తనకష్ట మీడేరెనని సంతసించెను. కాని యావార్తనాలించిన గ్రామవాసులందఱా తని మాటలను విశ్వసింపక యుపేక్షతో నుదాసీనతఁజూపుచు నీతని నెవరును బంక్తిభోజనమునకుఁగాని శుభాశుభకార్యంబులకుఁగాని యాహ్వానింపకుండిరి. అటులుండఁ గొంతకాలంబునకాయూర నొక విప్రునింట సమారాధన మొందు జరుగుచుండ ననాహూతుండయ్యు భీమకవి యాయూరి బ్రాహ్మణులఁగలసి భోజనంబునకుఁజన నచ్చటివారెల్లరాతని నోట వచియింపరానట్టుల నిందించి వెడలనడిచిరి. భీమన కోపాగ్రహపూరితుఁడై చేయునదియు లేక వెలుపలకువచ్చి లోన నడచుచున్న కార్యములు విలోకించి వడ్డనప్రారంభమయి భోజనపాత్రంబుల శాక, సూప, భక్ష్య, భోజ్య లేహ్యంబులమర్పబడియుండఁగాంచి యీదిగువపద్యమును జదివెనఁట.

ఉ॥ గొప్పలు సెప్పుకొంచుమను ♦ గూటికిఁ బంక్తికి రాకుమం
[చు, నీ
తిప్పుడు బాపలందఱును ♦ దిట్టిరి కావున నొక్క మా
[ఱ మీ
యప్పములన్ని కప్పలయి ♦ యన్నము సున్నముగాగ
[మాఱుచున్
బప్పును శాకముల్ పులుసు ♦ పచ్చడులున్ జిలు ఱా
[లుగాఁబుతన్॥

అని యనినవెంటనే వడ్డింపఁబడిన యన్నము సున్నముగను సూపమాదిగాఁగల పదార్థంబులెల్ల శిలలుగను, మాఱి యప్పములెల్లఁ గప్పలయి గంతులిడసాగెను. అచటి వారెల్లరాయద్భుతమును గని మిగుల నారాటమందసాగిరి. అంతట నాగృహమేధి యావిప్రుల యాతురతను మాన్పఁదలఁచి మఱలవడ్డించినయన్నపురాశిని సమీపింప నయ్యదంతయు సున్నముగను నప్పములన్నియుఁ గప్పలుగనయి దుముకులాడుచుండినటులఁ గన్పట్టెను. అపుడాయజమానుఁడట నున్నబ్రాహ్మణుల సమీపించి యాలోచింప వారందఱది భీమనగావించిన శాపమహాత్మ్యంబన వారంద ఱాతనిఁ జేరి ప్రార్థింపనాతఁడు వారి యవజ్ఞతను క్షమించి లోనికిఁబోయి వారితోఁగలసి భుజింప సమ్మతించి తిఱుగ

మ॥ ఘనుఁడో వేములవాడ వంశజుఁడు ద్రా ♦ క్షారామ [భీమేశనం
దనుఁడీభీమనయంచు గుర్తెఱిఁగి నిం ♦ దల్ మానినన్ [గౌరవం
బున నీవిప్రులు చూచిరందువలనన్ ♦ బూర్వస్థితిన్ [జెంది భో
జన వస్తుప్రకరంబులన్నియు యథా ♦ స్వస్థంబులో [గావుతన్॥

అను పద్యము నాశువుగాఁ జెప్పినతోడనే యాపదార్థంబులన్నియు నెప్పటియట్ల భోజనానుకూలంబులయ్యెను.

వెంటనే భీమకవివాక్యము లమోఘములని యచటివారందఱు తనిఁ దోఁడ్కొనిపోయి యగ్రస్థానాసీనుఁ గావించి వందారగించిరి. పూర్వమునిందించిన వారందఱప్పుడతఁడు దమ్మేమి శపించునోయనుభయమున నాతని మాహాత్మ్యంబనేక విధములఁ బొగడంజొచ్చిరి. మఱికొందఱు పూర్వము దామాతనియెడఁ దెలియమింగావించిన తప్పిదంబులనెల్ల క్షమింపఁ బ్రార్థించిరి. వారికందఱు కతఁడభయంబొసఁగి తన వాగ్విలాస వైభవంబున నానందపరవశులఁ గావింపుచుండెను.

మాచమ్మయనిన నేవగించుకొనిన నవతులందఱాపెపైఁ గ్రోధముమాని యాపె నతిగౌరవముతోఁ జూడసాగిరి. భీమకవి జ్ఞాతియగు ననంతామాత్యుండను నాతఁడాతని నుపనీతునిగావించి బ్రహ్మోపదేశమొనర్చెను. నాఁడుమొదలాతఁడు దాను ద్రాక్షారామ భీమేశనందనుండనని వ్యవహరించుకొను చుండెను. అనేకులీతండనినఁ గడుభయభక్తులమెలంగఁజొచ్చిరి. భీమకవి భయంకర కవియని సార్థకనాముండై యుద్దండకవితాధురీణుండగుటంజేసి యుద్దండకవియనియు నిగ్రహాత్ముండగు శాపదుండగుగతనఁ గవిరాక్షసుండనియుఁ దచ్ఛాపవిమోచనాశక్తి ప్రాభవదయార్ద్ర హృదయుండగుటచే వరప్రసాదుండనియు జనులెల్లరు వలుకఁజొచ్చిరి. ఆతని నిరుపమాన మహత్వకవితాలత యాంధ్రదేశంబునందేగాక యన్నిదేశంబులఁ బ్రాఁక నాకాలమందలి భూపా

లురీతని నాశ్రయించి రాజ్యలక్ష్మీసంపన్నులు కాఁదలంచి యాతనిఁ దమయాస్థానములకు విచ్చేసి పవిత్రితంబొనర్పఁ బ్రార్థించిరి. అతండష్టాదశ వర్షవయస్కుండగు సరికెచ్చటి కింజనక మాతృదేవతారాధనము సల్పుచు నిజనివాస ప్రాంతజులచే గౌరవింపబడుచుండెను. అనంతర మాంధ్రదేశమందలి నానారాజ సందర్శనమొనర్చి గర్వితులఁ దన యమోఘశాపానలనమునకింధనములఁ గావించి దయాపూరిత హృదయుండయినచో యథాస్థితిసంభవులుగ నొనరింపుచు లక్షాధికారుల భిక్షాధికారులుగను భిక్షాధిపతుల లక్షాధిపతులుగ నొనరించి తనరెను. ఈ భీమకవి వీనిహర్షసంజన కైతిహ్యాద్భుత కవితావిచిత్రంబులఁ గొన్నింటినిందుఁ బాఠకుల హృదయానందకరంబుగఁ బొందుపఱచెద. చళుక్యవంశజుండగు చొక్కరాజొక్కనాఁ డుద్యానవనమున మల్లెసాలస్తంభము మీఁదఁ గాలు సాచికొని కూరుచుండి యచటికేతెంచిన భీమకవింగాంచి యాస్తంభమును వృక్షముగాఁజేయుమన నాతఁడు

శా॥ ఆనీతాభ్యుపదాన శృంఖల పదా ♦ భ్యాలంచితస్థంభమా
నేనే వేములవాడ భీమకవి నే ♦ నిం జిత్రకూటంబులో
భూనవ్యాపిత పల్లవోద్భవ మహా ♦ పుష్పోప గుచ్ఛంబు [లఁ
నానాపక్వఫల ప్రదాయినగు మా ♦ నాకల్పవృక్షాకృతిన్

యునెడి భయముతోఁ గవిని జూచినంతనే యెదుర్కొని యర్ఘ్యపాద్యంబులిడి సకలోపచార సన్మానంబులొసంగి గారవించుచుండిరి.

ఇంతం డొకనాఁడు కళింగదేశ భూపాలుండగు గంగరాజును దర్శింప నాతని పురంబునకుంజని యుద్దండ కవియుఁ గవిరాక్షసుఁడును నగు వేములవాడ భీమకవి యరుదెంచె నని వార్తనుపఁ బ్రత్యుత్తరములేమి రాజు కొలువు దీరి యుండ నా కవియే సమక్షమునకేఁగుచుండ గంగమహీలుండెదురేఁగి ప్రత్యుత్థాన మొసఁగి తోడ్కొనివచ్చి యుచితాసనాసీనుఁగావించి నిజకార్యాచరణ నిమగ్నమానసుండయ్యెను. భీమకవి యెంతకాలము వేచియుండినను రాజు తన దెసఁగాంచక యుదాసీనతఁజూపఁ దాభీమకవిననియు వాని దర్శింపవచ్చితిననియుఁ దెలుప నాసమయంబునఁదాఁ గార్యభారనిమగ్నుండగుటంజేసి యాతని కవిత్వము వినఁ దనకుఁ దీరికలేదనియు మఱియొకప్పుడు విచ్చేయుమనియుఁ దెలుప నాతండుగినిసి యారాజువంకఁ దనరూక్షవీక్షణంబులఁబఱపి

"ఉ॥ వేములవాడ భీమకవి♦వేగమె చూచి కళింగగంగుతా
సామముమాని కోపమున♦సందడిదీఱినరమ్ము పొమ్మనెన్
మోమునుజూడదోషమిఁక ♦ ముప్పదిరెండుదినంబు [లావలన్
జామునకర్థమందతని ♦ సంపదశత్రుల పాలుగావుతన్॥"

అను పద్యముంజదివి యచ్చోటువాసి చనియె. ఆమ రునాఁడే తచ్చాప ప్రభావంబున వంగ దేశాధీశుండగు విక్ర మదేవుండీతనిపై దాడివెడలి యిరువదితొమ్మిది దివసంబు లాతనితోఁ బోరుసల్పి యోడించి రాజ్యమును వశముఁ గా వించికొని యాకళింగగంగును చెఱసాలయందునిచియావ లఁ గొంతకాలమునకు విడిచెను. గంగమహీపాలుండు విగత విక్రముండై భైక్షుకవృత్తిం బొట్టఁ బోషించుకొనుచు నొ క్కనాఁడు పెద్దాపురముఁ జేరెను. ఆ నాఁటిరాత్రి భీమకవి యారాజ సందర్శనార్థమచ్చటికింజని యొకచోట విడిసి భోజ నానంతర మా యింటి తిన్నెపై విహరించుచుండఁ గళింగగం గా యింటి కెదురుగనున్న ధాన్యపుపాతఱ గోతంగూలి కా లిదివిటీయైన లేకపోయెనుగదా యని యనుకొన నా వా క్యము లాలించి యాభిక్షుకున కట్టిరాజకవి వాక్యమెటుల వ చ్చెనా యని భీమకవి మనంబున సంకోచించి యాతని నడిగి వృత్తాంతమంతయు గ్రహించి యాతనిపై దయఁబూని మఱ ల నాతనిరాజుగఁ జేయందలంచి

"ఉ॥ వేయిగజంబులుండఁ బది ♦ వేల తురంగములుండ నాజిలో
రాయలఁ గెల్చి సజ్జనగ♦రంబునఁ బట్టముఁగట్టుకోవడిన్
రాయకళింగగంగ కవి♦రాజు భయంకరమూర్తిఁ జూడగాఁ
బోయిన మీనమాసమునఁ ♦ బున్నమపోయినషష్ఠి నాఁటికిన్॥

అని చదువఁ బ్రసంగకంగు భవ్యకవియని గ్రహించి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి యాశీర్వచనంబులఁ బడసి కవివాక్యానుసరణిఁ గాలక్రమంబున రాజ్యముఁ బడసి సింహాసన మధిష్ఠించెను. ఇవ్విధంబున భోగులజోగులుగను జోగుల భోగులుగ నొనరింపఁ గలదిట్టయై బహురాజన్యచూడామణుల స్తోత్రంబులకుఁ బాత్రుండై విరాజిల్లెను. అతండుకవిత్వమునందే కాక గణిత, వైద్య, జ్యోతిశ్శాస్త్రములందుఁ గూడ ననర్గళమేధానిధియై యాయాశాస్త్రంబుల గ్రంథరచనఁ గావించి మహోపకార మొనర్చెను. ఈ కవిచంద్రుఁడు లోకోపకారార్థము బహుగ్రంథముల రచియించి భీమేశున కర్పించి మహాయశస్సుఁ బడసి ప్రతిభా విచిత్రములఁ బ్రజల నద్భుతచకితమానసులఁ గావించి యశోగరిమ నార్జించి కవిలోకంబున కాచంద్రార్కంబగు గౌరవమును వెలయించి భౌతికదేహంబు సర్జనము గావించి యాధ్యాత్మికము గ్రహించి వన్నెగాంచిన కవిరాజహంసుండై యాంధ్రలోకైక స్మరణీయుండయ్యెను. పూజనీయుండై యొప్పుచుండెననుట సర్వాంధ్రహృదయ సంవేద్యవిషయమై యున్నయది. ఆ మహాకవి యద్భుతకవితావిచిత్రంబులఁ బఠించిన నే యాంధ్రుని హృదయంబున మోదంబావిర్భవించి మేనగగుర్పాటుఁ జెందకుండును? అట్టి కవిరాజు లాంధ్రభూమి నలంకరించు సుదినంబులా పరమేశ్వరుం డనుగ్రహించుఁగాక.

---

# 7 రామకృష్ణకవి.

తెనాలి రామకృష్ణకవి శాలివాహనశకము 1427 వ సంవత్సరమునకు సరిగాఁ క్రీ॥ శ॥ 1515 వ సం॥ మునకుఁ బూర్వమునందే జనియించి దాదాపు తనకు నలుబది వత్సరముల ప్రాయము సరిగ శా॥ శ॥ 1465 వ సం॥ నకు సరియగు క్రీ॥ శ॥ 1543 వ సం॥నఁ గృష్ణదేవరాయల యాస్థానమందలి యష్టదిగ్గజములలో నొకఁడై యుండినటులఁ గన్పట్టుచుండెను. ఇతఁ డారువేల నియోగి బ్రాహ్మణుఁడు, కౌండిన్యస గోత్రోద్భవుఁడు, రామయామాత్య లక్ష్మమాంబల తనూజాతుఁడు, కృష్ణామండలస్థ గార్లపాటి నివాసియునై యుండెను. గార్లపాటి నివాసియగుటం జేసి ఇతని గృహనామముగూడ గార్లపాటివారనియే యొప్పియుండెను. కాని యితని తలిదండ్రులు బాల్యంబుననే మరణించుటం జేసి యితని మాతులుండు నిజనివాసంబగు తెనాలి పురంబునకుం గొంపోయి నామకరణాది కర్మలం జరిపి విద్యాబుద్ధుల వెలయించెను. ఆగ్రామంబున రామలింగేశ్వరుఁ డను పేరుగల దేవుఁడుండినందున రామలింగ మనియు పాండురంగ మాహాత్మ్యముఁ బ్రచురించునాఁటికి వైష్ణవమతప్రవిష్టుండగుచు రామకృష్ణుఁడనియు వ్యవహారికనామములఁ బడసినటులఁ గన్పట్టెడిని. కాని

దీనికిని నొక్కిచుక మార్పుగలదు. రాయల మంత్రి భాస్కరుని సంబోధనములవలన రాయని బాచా యను నామ ముండినట్లు గలదు. భాస్కర రామకృష్ణుఁడను నామమును గలిగియుండినటులఁగూడఁ గన్పట్టుచుండెను. అందులకుఁ గొన్ని కారణములు గలవు. అందు నమ్మఁట కనువగు గారణ మొక్కటి నిందుదహరించెదను.

ఈ కవి జనకుండగు రామయ్య యొకప్పుడు క్షయ రోగపీడితుండగుడు నెన్ని వైద్యములొనర్చినను గుదురనందు నఁ దనవ్యాధి నివారణమైనచోఁ దన కుమారునకు రామ కృష్ణనామ ముంతుసని తద్దేవులకు మ్రొక్కుకొనెనఁట. అత నిసతి లక్ష్మమాంబ తనపతికి వ్యాధి నివారించినఁ దనపుత్త్రు నకు సూర్యనారాయణమూర్తి పేరు పెట్టెదనని మ్రొక్కు కొని సూర్యనమస్కారములుగావింప నాపె పతి యారోగ్య వంతుడయ్యెననియు నా ముప్వురనామములు గలసి వచ్చు నటుల భాస్కర రామకృష్ణుఁడని నామముంచెనఁట. ఏత త్కారణంబున భాస్కరశబ్దభవమగు బాచఁడు, బాచిగాఁడు నను నామములాతఁడు గలిగియుండవచ్చును. ఏదియెటు లున్న నీతండు మహాకవియై యొప్పెననుట కొంతయు సం దియములేదు. ఈకవి విరచితంబులగు పాండురంగ మాహా త్మ్యము ఘటికాచలమహాత్మ్యములయందలి గద్యముల వల న నీతఁడు రామకృష్ణుఁడు రామలింగము నను నామముల వ్యవహరింపఁ బడుచుండెను.

## —♦ బాల్యము. ♦—

ఈతని బాల్యచరిత్రము వినుటకుం గడునింపుఁ గొలుపుచుండును. ఈతండు మాతులునింట విద్యాభ్యాసముఁ గావించునాఁడు విద్యాభ్యాసమునందంతగ మనంబుఁ జొప్పింపక తోడిపిల్లలంగూడి యల్లరిగఁ దిరుగుచు నాటపాటలమేటియై స్వేచ్ఛగ మెలఁగుచుండెను. ఈతనిచే నోడింపఁబడని సహాధ్యాయుండు గాని జయముఁగాంచఁజాలని యాట గాని లేదనుట సత్యమునకు దూరముగాదు. ఈతనిచేఁ దాపులను దెబ్బలను, గిల్లులను, అక్కులను బొందని చెలికాఁడు లేడనియే చెప్పవచ్చును. మాతాపితలు చిన్ననాఁటనే మరణించుటంజేసి యీతని స్వేచ్ఛావిహారంబునకు భంగమాపాదించువారంతగ లేకుండిరి. మాతాపితృవిహీనుండగు బాలుని మనసు నొప్పింప మేనమామయు నిచ్ఛగింపకుండెను. ఇటులుండ నొకనాఁడు మనకథానాయకుఁడు తోడిబాలురఁగూడి యాడుచుండ మార్గంబున సిద్ధుఁడొకఁడరుదెంచి రామకృష్ణునిఁగాంచి, వాని రూపురేఖావిలాసంబులకుఁ గడునలరి, డగ్గరి కులగోత్రనామంబులడిగి తెలిసికొని వానికొకమంత్రంబుపదేశింతుననియు, దానిఁబఠింపుచు భవానిని ధ్యానించినఁ దత్ప్రసాదపాత్రుండయి మనోరథసిద్ధిఁ గాంచుననియుఁ దనకు నిర్యాణకాల మాసన్నమగుడుఁ దానెఱింగిన మహావిద్య నన్యుల కుపదేశింపమిఁ దనతో నంతమందుననియుఁ దనకుఁ దె

లిసినవిద్య నొరులకుం జెప్పనివాఁడు బ్రహ్మరాక్షసుం డగున నియుఁబలికి యామంత్రంబు రామకృష్ణున కుపదేశించెను.

అనంతరము రామకృష్ణుం డామంత్రప్రభావ మెఱుం గఁగోరి నాఁటిరేయిఁ గాళికాదేవళంబు సొచ్చి వినయావన మిత గాత్రుండై యాదేవిం గూర్చి ప్రార్థన భక్తి పరాధీన యగు నాదేవి ప్రత్యక్షంబగుడు రామకృష్ణుం డంజలి ఘటి యించి స్తోత్రంబుఁ గావించెను. అంత నాభవాని కరుణించి నిజకరద్వయంబున వెలుఁగు దధిక్షీరసమన్విత స్వర్ణరజత పాత్రలంజూపి యందొకటిఁ గ్రోల నైశ్వర్యంబును, రెండవ దానిలోని దధిని ద్రావిన విద్యయు లభించుననియు నందేదేనిఁ గైకొనుమనియు ననెను. అప్పుడు రామకృష్ణుండు "అమ్మా! వానియందలి విశేషంబు లేర్పరింప నాకశక్యంబులు ఆపాత్రద్వయంబు నా కరయుగంబునందుంచికొని వీక్షించి కలయుదంతంబుఁ దెలిపెద"నన నాయమ యాపాత్రద్వయ మొసంగెను. అతఁడాపాత్రద్వయంబుఁ గరతలంబునందుంచికొని యందొక్కదానిలోని రసంబు రెండవపాత్రిం జేర్చి వానిం దన గొంతుకలోఁ బోసికొని తనకారెండు నావశ్యంబులగుటచే నటులఁ జేసితిననియు, క్షమింపుమనియుఁ బలికెను. అందులకాశర్వాణి మిగులఁ గసలి తన యాజ్ఞోల్లంఘనంబుఁ గావించినందులకాతండు విద్యాంధయ చేతస్కుండయ్యు వికటకవి యగునటుల శాపంబొసంగెను. రామకృష్ణుండు వెంటనే

యాంయమ పాదంబులపైఁ బడి, "తల్లీ! తనయులతప్పులు తల్లి గావకుండిన నిఁక వేఱుగతియేది? తల్లివిషమిడినను తండ్రి ధనికులకమ్మఁదలంచినను బిడ్డలకు శరణ్యమేది?" అని పెక్కువిధంబుల దీనాలాపంబుల వినుతింప నాదేవి "వికట కవివయ్యెదు రాజసన్మానమును బడయుమవుగాత" మని వరంబొసంగి యంతర్ధానంబయ్యెను.

## —♦ రాయల యాస్థానప్రవేశము ♦—

నిజమనోరథసిద్ధి నందఁదలంచిన రామకృష్ణుండటుల గాళికావరంబుఁ బడసి నిజనివాసంబున కరిగి నివురుగప్పిన నిప్పువలెఁ దనసామర్థ్యముఁ గుప్తపఱిచికొని కొంతకాలంబుఁ గడిపి యొకదినంబున రాజసన్మానంబు గలుగునని యొసఁగఁ బడిన భవానిదేవత వరంబు లోనెంచి తనకు రాజసభకుఁబోవు నుపాయంబెటుల లభ్యమగునని తనవిద్యాతిశయమును గూర్చి రాజెఱుంగు సాధనోపాయముంగూర్చి చింతింపఁదొడంగెను. మఱియు "నందనిమ్రానిపండ్లకొఱకులుసాపనేల?" యని రాజసభకేఁగి తద్దర్శనలాభంబు వడయుటఁ దనకసాధ్యమనియెంచి కొంతకాలమూరకుండెను. కాని రాజానుగ్రహంబు వడయ రాజగురుండగు తిరుమలతాతాచార్యులవారి సన్నిధికింజని తనయుద్దేశంబెఱింగింప నాతండు సమయములభించినపుడుఁ దాఁదెలియఁజేసెదనని మూకీభావమూని యుం

డెను. రామకృష్ణుడనుదినంబాచార్య సాన్నిధ్యంబునకుం బో వుచు వాని నెంతనాశ్రయించుచుండినను లాభములేకుండెను. తుదకాచార్యుని మోసంబు గ్రహించి మాయోపాయంబు నం గాని తనకు సభాప్రవేశ మొనఁగూడదని నిశ్చయించి తత్సాధనోపాయంబులరయుచుండెను. ఇట్లుండ నొకదినంబు నం గృష్ణదేవరాయలు కవి బుధనికరపరివేష్టితుండయి గురు నితో సంభాషింపుచు నిండోలగంబునం గొల్వుండ వాకిటం గట్టంబడిన నూతనపండితజన విద్యాప్రకాశకఘంటానాదము ను వినెను. అనవుడు పుడమిఱేఁడొక నూతనపండితుండు దనసభకు రానుండినటుల గ్రహించి యాతని దర్శింపను త్సుకుండయి భటముఖంబున వానిని లోనికిఁగొనిరా నాజ్ఞ నొసంగ రాజాజ్ఞానుసారంబున నాతండు సభాస్థలిం బ్రవేశిం చెను. రాజాతనింగని యాతం డేయేవిద్యలం బ్రవీణుండని ప్రశ్నించెను. అంత నాతండు "స్వామీ! నానేర్చినవిద్యలం బరీక్షింపుసులభమార్గముం దెల్పెదవినుండు. విద్యకు నొక్క వేత్రటయిన నీగంటబీటవాయును. పరీక్షార్థినై నీసాన్నిధ్యం బునకు వచ్చితిని. నాయభీష్టముం దీర్చి నన్నాస్థానకవిగాఁ గైకొనఁగోరెద"నని పలుక వానివాక్యంబులకు సభ్యులాశ్చ ర్యమందిరి.

రామకృష్ణునిగూర్చి కథలు పెక్కులుగలవు. వాని లో రసికజనసమ్మతములు పండితజనశ్రవణ యోగ్యంబులు

సరసగుణాభిరామంబులు ప్రశంసార్హములునగు వానిలోఁ గొన్ని (టిని మాత్ర)మే దెలిపి పామరజన మనోరంజకములు, గర్హ్యములు, నసభ్యములు నగువానిని విసర్జించెదను.

—♦రామకృష్ణుండు జ్యోతిషవిద్యయం దుత్తీర్ణుండగుట.♦—

కృష్ణదేవరాయలు సభాసదులంగని యీవిద్వాంసుని బరీక్షింప ననువగు దైవజ్ఞు నెఱింగింపుఁడని సభాస్థలినున్న వారిఁ బ్రశ్నింప వారందఱాలోచించి యాంధ్రకవితాపితా మహుండగు నల్లసానిపెద్దనయే యందున కర్హుండని పలికిరి. రాజు వానినే యందులకు నియోగించెను. అపుడు పెద్దన వారిపలుకులువిని తనలో నిట్టులాలోచించెను. "ఆహా! వీరంద ఱీకార్యమునకు నన్ను నియమించిరి. ఈపండితుని సామర్థ్య మెట్టిదో యింతవఱ కెఱిఁగినవారులేరు. ఎదిరి శక్తియు దన శక్తియు నెఱుంగక మిడిసిపడువాఁడు భంగమందుట నిక్కం బు. అటులని యూరకొనినఁ దలవంపులు ఘటిల్లును. ఈ చిక్కును సడలించుకొనుట కాకునకందక పోఁకను బొందకుం డునటులఁ బ్రశ్నించెదను." అని కవివంకకుఁ దిరిగి స్వర్గలోక వార్తావిశేషములిపు డెఱిఁగింపుమనియె. అంతట రామకృష్ణుండు పెద్దననుతించి రాయలంబొగడి మింటఁ జూచి కనులుమూసి ఛాయల లెక్కించి రెండు గీతలఁగీచి యంగుష్ఠంబు లెన్ని యిట్లు నుడివెను. "భూమీశా! మన శిరోభా

గంబులకు సూటిగ నిపుడు నాకేశుం డనురావతియందు సభాసీనుండయి, రంభాద్యప్సరసగణము నాట్యముసల్పుచుండ వినోదింపుచుండెను. రంభపాదనూపుర మొండుగళితమై యిలాతలంబునఁ బడనున్నది. ఒక యామములో నయ్యది భూమిపైఁ బడును. అదియొక గిరిపైఁ బడును. "భవంతి నభవంతిచ" యనెడి పార్వతీశాపమున నియ్యదెచటఁబడునో నిర్ణయింప నలవి గాకుండెను." అని నాతని వాక్యముల కెల్ల రాశ్చర్య మందుచుండ "రామకృష్ణుండు కాళీప్రసన్నుండగుటచే నాతఁడు సెప్పినవిధమున యథాకాలంబునకు నూపురము ఘల్లున మ్రోయుచు నొక శైలంబునఁబడి రెండవశైలంబునకుం దొరలిన సభ్యులు, రాయలు, విస్మితచిత్తులయి రామకృష్ణుని ప్రతిభఁ బొగడిరి. అపుడీరాయలాతని నష్టదిగ్గజములలో నొకనిఁగావించెను సభ్యులందఱు హర్షించిరి.

—♦ దినమునకు నూఱుతప్పులకు రాయలంగీకరించుట. ♦—

ఒకనాఁడు కృష్ణదేవరాయలు నిజాస్థాన కవీశ్వరులం గలసి స్వల్పసంఖ్యా సైనికులతో విలాసార్థము తుంగభద్రా నదిందాటి చూరిగెను. శత్రునిర్మూలనమునకై సమయము వేచియున్న కనిగిరి రాజయిన వీరభద్రరాజునకు సామంతుఁడు దండనాథుండునగు పసరము గోవిందరాజను నాతఁ డానిర్జన ప్రదేశమునఁ జతురంగబల సమన్వితుఁడై కృష్ణదేవరా

ఘుల నెదుర్కొనెను. రాయల సైన్యమా గోవిందభూపాలుని ధాటికోర్వలేక పలాయనమగుచుండ రాయల కపజయము గలుగునట్లులఁ దోఁచెను. ఆ నిర్జనప్రదేశమున రాయల వెంబడించిన వంటలవారు కవులు దక్క సైనికు లెవ్వరును లేకుండిరి. అపుడు రాయలు చేయునదిలేక "మీ రెల్లరు నాకు జయముగలుగునట్టు లాశీర్వదింపుడని కోరి కరవాలముం గైకొని కమలాకరముంజొచ్చు గజముభంగి పగతుర సైన్యముఁ జీల్చెదనని బయల్వెడలి గోవిందభూపతి సైన్యముం దాకెను. ఇరువాగులకు యుద్ధము తీవ్రముగఁ జరుగుచుండెను. యుద్ధావనికి రామకృష్ణుఁడు ముందుగఁజని తన కవితా తేజము విజృంభింప గంభీర నిస్వనంబున

క॥ బసవనకుఁ బుట్టినప్పా
పసరము గోవిందరాజు ♦ పసరంబైనన్
గస వేటికిఁ దినఁడనగాఁ
గసవుందిను శత్రులాజిఁ ♦ గదిసిన వేళన్॥

అని శపియింపఁ దచ్ఛాపమా శత్రుని ఫిరంగిదెబ్బ కంటె నెక్కువగా గోవింద భూమీశుని శ్రవణకుహర మార్గంబున హృదయంబును వ్రయ్యలుగావించెనో యన నాతండు రక్తము గ్రక్కుకొని గుభిల్లున నేలంగూలెను. అంత గోవిందరాజు గోవిందుఁజేర నాతని సైన్యము చెల్లాచెదరయ్యెను. అత్తటి రాయలు రామకృష్ణుని నిరాఘాట భీషణ

కవితాపటిమంగాంచి ముదమంది కవితిల్లజు ననేకగతులం బొగడి యాతనికి వలసినవరముం గోరుకొనుమనిన రామకృష్ణుండు "దేవా దేవర కరుణారసాపాతంబున నా కవితాశక్తి కింతటి శక్తికల్గినది. దీనికై నన్నంతగా శ్లాఘింప నవసరములేదు. తాము గోరుకొనుమనిరిగనుక నేను దినమునకు నూఱుతప్పు ల్గానరించినను దేవర వాని నన్నింటిని మన్నింప వరమొసంగ వేడెద" నన నారాయలందుల కంగీకరించి యుభయహస్తమొసంగి యప్పటినుండియు రామకృష్ణుండొనర్చు నపరాధముల సైచుచుండెను.

## —♦ వ ర హా ల ప ళ్లె ర మం దు కొ ను ట. ♦—

రామకృష్ణుఁడు ప్రభుసన్మానంబుఁ బడసి తన హాస్య విచిత్ర ప్రదర్శనములఁ జూపుచు సర్వజనాహ్లాదకరుండయి మెలఁగుచుండెను. ఇటులుండ రాయలొకనాఁడు వరహాల నంచిగల పళ్లెరమొకటిందెచ్చి సభామధ్యంబునందునిచి రస భరితముగా నిర్దుష్టముగాఁ బద్యముసెప్పి పళ్లెరముం గైకొనుండని పండితుల కాజ్ఞనొసఁగ వెంటనే పెద్దనకవి లేఁచి

మ॥ శరసంధానమిల క్షమాదివివిధై♦శ్వర్యంబు లుఁగల్గి దు
ర్భరషండత్వబిల పరివేశచలన ♦ బహ్మాఘ్నుతల్మానిర్జ
నరసింహ క్షితిమండలేశ్వరునె ♦ న్నన్వచ్చు నీపాటిగా
నరసింహక్షితిమండలేశ్వరుని కృ♦ ష్ణా రాజకంఠీరవా॥

అని తన యాశుకవిత్వ విద్యానైపుణ్యముంజూప రామకృష్ణుండు పెద్దనంజూ(చి నగి తాతా! బిలప్రవేశమొనర్చినను రాజకంఠీరవా యని తో(క(బట్టి వెలికిరమ్మని పిలిచి యీడ్చుచుంటివి. ఇది దోషమేకదా! ఇదె నేనొకపద్యము( జెప్పెదనని

మ॥ కలనందావక ఖడ్గఖండిత రిపు ♦ క్ష్మాభర్త మార్తాండ మం
డల భేదంబొనరించి యేగు నెడ( ♦ దన్మధ్యంబునన్ హారకుం
డల కేయూర కిరీటభూషితుని శ్రీ ♦ నారాయణుంగాంచి లో(
గల(గంబాఱుచు, నేగె నీవ యను శం♦ కన్ గృష్ణరాయాధిపా॥

అను పద్యముంజదువ నందఱుమెచ్చి యాతని కాపారితోషిక మొసంగు(డని రాయలకు విన్నవింప నాతండు రామకృష్ణునకే యొసంగెను.

—♦ రామకృష్ణు(డు రామరాజభూషణుని నైలిందెల్పుట. ♦—

ఈ మహాకవి దేవీయనుగ్రహంబున జయముగాంచుచు నిచ్ఛానుసారంబుగ విహరింపుచుండ నొకనా(డు రాయలు సభలోని పండితుల(గాంచి పెద్దన, తిమ్మన, రామరా

జభూషణుల కవితావిశేషంబులం దెల్పుండన వారలేమియుం దెల్పఁజాలక సంశయమందుచుండ రామకృష్ణుండు లేచి, "దేవా! ముదలయ్యేనేని నాకుం దోఁచిన తెఱంగున వారివారి గ్రంథంబులయందలి పద్యంబుల నాకు స్ఫురించిన వానిం దెల్పెదనన రాజు వల్లెయనియె. అంతటఁ బెద్దన కృతమగు మనుచరిత్రమునుండి,

ఉ॥ పాటునకింతులోర్తురె కృపారహితాత్మక! నీవుత్రోవ ని
చ్చోటభవన్నఖాంకురముసోకెఁ గనుంగొనుమంచుఁజూ
[పి య
ప్పాటలగంధివేదననెపంబిడి యేడ్చెఁగలస్వనంబుతో
* * * * * *

అని చదివి తిమ్మకవి కృతమగు పారిజాతాపహరణంబునుండి.

ఉ॥ ఈసునఁబుట్టిడెందమును ♦ హెచ్చినశోకదవానలంబుచే
గాసిలి, యేడ్చి ప్రాణవిభు♦కట్టెదుటన్ లలితాంగి, పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ ♦ జేరచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకల♦కంఠల వధూకల కాకలీధ్వనిన్

అని విన్నవించి రామరాజభూషణుని వసుచరిత్రమునుండి.

శా॥ ఆజాబిల్లి వెలుంగువెల్లికలడా ♦ యన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁబటా♦గ్రంబెత్తి యొల్లెత్తియా

రాజీవాననయేడ్చెఁ గిన్నరవధూ ♦ రాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచి కారవసుధా♦పూరంబుతోరంబుగన్"

అని చదివి "భూమీశా! నాకుం జూడ నిందల సాని పెద్దన యటునిటు నేడ్చినాఁడు. ముక్కుతిమ్మన ముద్దుముద్దుగ నేడ్చెను. భట్టుమూర్తి బొవురుమనెను. మొత్తముమీఁద ముగ్గురు మూఁడువిధములుగా నేడ్చిరి. ముగ్గురయేడ్పులు ముచ్చటగనేయున్నవనిఁ దోఁచుచున్నదన రామకృష్ణునియుక్తిఁ గని యందఱును నవ్వుకొనిరి.

## —♦ ముక్కుతిమ్మన్న నలయించుట ♦—

ఒకానొకదినంబున రామకృష్ణుఁడు ముక్కుతిమ్మన గృహంబునకుంజనుడు, తిమ్మన భంగరుటుయ్యెలలోఁ గూర్చుండియుండెను. రామకృష్ణుం డాతనింగాంచి "తాతా! యూఁతునా!" అని యడుగ నాతండు వల్లెయనియె. అంతట రామకృష్ణుండు తిమ్మనపైని దుబుక్కున నుమిసెను. అందునకుఁ దిమ్మన కనలి కాలిపాదుకనాతనిపై విసర నది యాత నివదనంబునందలి యొక రదనము నూడనడిచెను. రామకృష్ణుఁడు వగపుతో నింటికిం బోయి కొంతవడిఁ జింతించి, యొక దుప్పికొమ్మును జెక్కించి, పంటిగ నమర్చి యంటించి కొని మఱునాఁడు సభకేగెను. రాయలు ప్రసంగవశంబునఁ

గవీశ్వరులఁ దిలకించి "రవి గాననిచోఁ గవి గాంచునేకదా" యని సమస్యనిచ్చెనఁట. అంతట భట్టుమూర్తి లేచి తన వగఁ దీర్చికొనుటకదియే సమయమని రాజుంగాంచి యిట్లని యా సమస్యను పూరించెను.

ఉ॥ ఆరవి వీరభద్రిచరణాహతిదుల్లిన బోసినోటికిన్
నేరడు! రామలింగకవి నేరిచెఁబో, మన ముక్కుతిమ్మన
క్రూరపదాహతిం దెగిన కొక్కుఅ పంటికి దుప్పికొమ్మువ
ల్గా రచియించెనోర! రవి గాననిచోఁ గవిగాంచునేకదా

అని రచియించి ముక్కు తిమ్మన్న చేఁ దన్నులు తినెనని సూచించెను. రాయలా సంగతి నడుగ భట్టుమూర్తి వలన నా యుదంతము నెఱింగెను. రామకృష్ణుని కొంటె పనిని విని సభ్యులందఱు నవ్వసాగిరి.

అశేష శేముషీ ధురంధరుండగు రామకృష్ణకవి యొనర్చిన పనులను గూర్చి వినినకొలఁది సంతస మొదవుచుండు ననుట నిస్సంశయము. ఈతని చెయిదములు వీనుల విందుగ నుండును. విద్వాంసుఁడు,మహాకవి, యుక్తిపరుండు, సమయోచిత జ్ఞానియునగు నీ తెనాలి రామకృష్ణుని చరిత్రము సంతతానంద ప్రదమగుటం జేసి తన్నామమాంధ్ర మహాశయుల హృత్పద్మ పీఠంబుల సదాయధిష్ఠించి యుండుట కావంతయు సందియములేదు.

# చాణక్యుఁడు.



శ్రీమద్రామాయణమునందు దశరథ సుమంత్రులు, సుగ్రీవాంజనేయులు, భారతమునందుఁ గృష్ణార్జునులు, ధృతరాష్ట్ర విదురు లెంత ప్రాముఖ్యులో ముద్రారాక్షసమునందుఁ జాణక్య చంద్రగుప్తులు, నందరాక్షసులు, నంతటి ప్రాముఖ్యులని తచ్చరితమును బఠించువారలకుఁ దోఁచక మానదు. చాణక్యుని చెయిదములను నాతని శపథములను బఠింపుతటి గాధేయుని కోపసాహస సామర్థ్యములును, భీష్మాచార్యుని నీతి ప్రావీణ్యమును, శ్రీకృష్ణుని శత్రుసంహార ప్రయత్నములును హనుమంతుని స్వామికార్యధురంధరత్వమును, హనుమద్భీష్ముల బ్రహ్మచర్య నియమములును, స్మరణకు రాక మానవు. విష్ణుపురాణమునందును మత్స్య,వాయు, భాగవతాది పురాణముల యందును జాణక్యుని చరిత్రము ప్రశంసింపఁబడి యున్నది. ఈతం డగ్నిసమతేజుండు, చతుర్వేద విదుండు, అభిచారమను వజ్రాయుధమూని నందుఁడను పర్వతమును ఛేధించిన భూసురేంద్రుండు. ఘటనాఘటనా సమర్థుండు, నిజతంత్ర మంత్రోపాయంబులఁ జంద్రగుప్త మహీపాలునకీమేదినీవలయ మొసంగిన రాజకీయ కలావిశారదుండు, నీతిశాస్త్ర కోవిదుండునై యాతని కాలంబునఁ బుడమినెల్ల గడగడలా

డించి స్వతంత్రుల సామంతులుగను సామంతుల స్వతంత్రు లుగ నొనర్చిన ధీవిశాలియయిన చాణక్య మహాశయుని చరిత మవశ్య పఠనీయము.

మహాబల పరాక్రమోపేతుండు, శౌర్య ధైర్య గాంభీర్య సహితుండునయిన మహాపద్మనందుండు మగధ సామ్రాజ్యమును జిరకాలముపాలించి యనన్య సామాన్యవిక్రమదర్పంబులు మెఱయ నరివీర మండలము నుఱుమాడి యశోవిహారుండయ్యెను. ఈతనికి మహాపద్ముండను నామాంతర మొండుండె. బహుధనోపేతుండగుటంజేసి యీతనికీనామము సార్థకమయి యుండనోపు. నూఱుకోట్లు పద్మము. వేయి పద్మములు మహాపద్మము. నిజ ప్రతాపాభివృద్ధిచే మగధరాష్ట్రము నందలి జనుల దయాదాక్షిణ్యా విరహితుండై పీడించి,పన్నులు కప్పములు, కానుకల రూపమున గ్రహించినందున ధననందుఁడను నామమును వహించెను. ఈభూపాలున కిళయను రాణియు, మురయను నుంపుడుకత్తెయు నుండిరి. ఇళకెనమండుగురు పుత్త్రు లుద్భవించిరి. తండ్రియగు నందుఁడును వీరెనమండుగురును గలిసి నవనందులని పిలువంబడిరి. మురకు జనియించినవాఁడు మౌర్యుండని వ్యవహరింపఁ బడుచుండెను. ఈ మౌర్యుని పుత్త్రుఁడే చంద్రగుప్తాభిధానుండు. మహాపద్మనందుఁడు దుష్టస్వభావుండై ప్రజాపీడన మొనర్పఁ నాతఁడు ప్రజల కప్రియుండయ్యెను. పాలకపాలితు లన్యోన్యమైత్రిం

రించెను. మౌర్యుని నూర్గురు పుత్రులును నవనందుల సైన్యములకధిపతులుగాఁ జేయంబడిరి. కాని సపుత్రకుండగు మౌర్యుండు రాజ్య మపహరించునేమో యని నందులు మౌర్యునిపై నసూయాజనితులై, రాజ్యమదోన్మత్తులై, సాధుసజ్జన విద్రోహకరులై, తమ యుద్యానవనమున నొక కృత్రిమ గృహమును నిర్మించి మౌర్యుల నటకు రాఁబిలిచి వారలనందఱ నా గృహమునఁ బ్రవేశపెట్టి మడియింపఁజూచిరి. కాని చంద్రగుప్తుఁడు మాత్రము సజీవుండై మిగిలినవారెల్ల రా భూగర్భమందు దుర్మరణమందిరి. సజీవుండైన చంద్రగుప్తుం డాయాపదఁ దప్పించుకొని యీవలకు రాఁగలెను.

—♦ చంద్రగుప్తుండు చాణక్యాశ్రయముఁ బడయుట. ♦—

లంబిత దీర్ఘబాహువుండును, రాజలక్షణ సమన్వితుండును, శౌర్యౌదార్య గాంభీర్యనిధియు, నయవినయశాలియు, నైన నాచంద్రగుప్తు నెటులనయిన సమయింప నందులు తగిన సమయమున కెదురుచూచుచుండిరి. ఉన్నతపదవి నుంచిన నంతః క్షోభమునకును వెడలఁగొట్టిన బాహ్యక్షోభమునకును వెఱచి యొక నీచపదవియందు నియమించిరి. నివురు గప్పిన నిప్పువలెనుండిన చంద్రగుప్తుండు సమయమున కనువగు నటుల సంచరించుచుఁ బగతీర్చుకొనుటకుఁ దగిన యుపాయముల నెమకుచుండెను. ఇటులుండ నొకనాఁడు గ్రకుల జాతుండొండు బాటవెంబడిం జనుచుండ నిజపాదస్పర్శితంబగు దృణ

కాష్ఠంబును వేరుతోఁ బెఱికి కాల్చి బూదిని నీటఁగలిపి త్రాగుటఁ జంద్రగుప్తుండు గాంచి యాగ్రహావతారమే యీ రీతి మూర్తీభవించెనని తలంచి యిట్టి ప్రచండ కోపియే నం దవంశ నిర్మూలమునకుం దగినవాఁడని నిర్ణయించి యాభూ సురపుంగవుని వెంటాడించెను. పైనిఁ జేర్కొనంబడిన దిన మున నాభూసురుండు నందుల యాస్థానమునుండియే వచ్చు చుండెను. నీతిశాస్త్ర ప్రణేతయగు చణకుని నందనుండును, సర్వధర్మ విదుండును, గుణాఢ్యుండు నయిన శ్రోత్రియబ్రా హ్మణుండగు చాణక్యుండు రాజసభకుఁజని యొక యున్నతా సనమునందుపవిష్టుండైయుండ నందులేతెంచి యా వికృత రూపుండును బ్రహ్మచారియునగు బ్రాహ్మణుని బరిహసించి తిరస్కారభావముతోఁ "బీదబాపండవగు నీవు రాజసభలో నున్నతాసనము నధిష్ఠించితివిగా?" యని మేలమాడి గర్వి ష్ఠునిగఁ దలంచి యాయాసనమునుండి కేశబంధనముఁబట్టి క్రిందికి లాగిరి. అత్తఱి నచటనున్న మంత్రులున్నగువారు బ్రాహ్మణోదాసీనము వలదని యెంతబోధించినను వారిద్రో ల నామంత్రుల బోధనలన్నియు వమ్మయ్యెను. అంత నాచా ణక్యుని శిరోజములు వీడ మహోగ్రహాదగ్రుండై రూక్ష వీక్షణంబులఁ బ్రసరింపుచుఁ గంపితగాత్రుండై, యాడుఁగలు చుచు నచటివారెల్లరు వినునటుల "మూర్ఖులారా? నిండుస భలో నకారణముగ నగ్రాసనమునుండి లాగి యవమానప

అచితిరిగదా! ఇటులనే మిమ్ముల రాజ్యభ్రష్టులఁగావించి మీశిరముల ఖండించినఁ గాని నాశిరోజముల బంధింపను. మదీయచాతుర్యమును సామర్థ్యమును జూచెదరుగాక" యని సమయమొనర్చి పరాభవానల దహ్యమానసుండై వీరరుద్రావతారమో యనునటుల విసవిస నడచుచు నాఁడు చంద్రగుప్తుని దృష్టింపగనెను. అటులఁ గాలరుద్రునిగతి గర్జించి వెడలుచుండిన చాణక్య కోపానలము పల్లార్పఁబ్రయత్నింపకుంటయేగాక దుష్ప్రలాపులు, దరిద్రులు, పవిత్రులు, క్రియాశూన్యులు, నయిన యీ కుహనాబ్రాహ్మణులా మమ్ము వంచించునది? చాలుచాలు నీపాటికి నీదబ్బఱలు కట్టిపెట్టి యావలకుం జనుము" అని మిన్నకుండెను. అహో! పాపము బ్రాహ్మణద్వేషము సామాన్యమా? అది తొలుత సాత్విక రూపంబునఁ జూపట్టి రాను రాను తామసాగ్ని రూపము వహించి యెందఱి యొక్కొక్క వంశ మొక్కొక్క రాజ్యమును నాశన మొనర్పఁగలదు. అటులనే నందులాఫలము ననుభవింపవలసినవారైరి.

అటులఁ జాణక్యుఁడు గొంతదూరమేగి వెనుకకుఁజూడ వెన్వెంటనే తగిలియున్న చంద్రగుప్తుఁడు ఆభూసురునకు సాష్టాంగ ప్రణామంబొనర్పఁ జాణక్యుఁడా బాలకుని లేవనెత్తి కుశల ప్రశ్న మొనరింపఁ జంద్రగుప్తుండును తనకును నందులకును గల విరోధమును విన్నవించి శరణంబు వేడెను. చాణక్యుండు

చంద్రగుప్తునొద్దాఁ "సర్వనంద సామ్రాజ్యమునకు నిన్నభిషిక్తుంజేయుట మదీయ ద్వితీయ శపథము" అని వచియించి నాఁటఁగోలెఁ జంద్రగుప్తుని దనయుంతఁ జేర్చుకొని నందకుల నిర్మూలనోపాయంబు లూహింపుచుండెను.

—♦ ప్రతిజ్ఞాపాలనము ♦—

చాణక్యుఁడొకదినంబునఁ దనకు మిత్రుండును సహాధ్యాయియు నగు నిందుశర్మను రప్పించి నందసభలో జరిగిన వృత్తాంతమును బూర్తిగఁ దెల్పి తనకు సహాయముగ నుండ కపటరూపమును ధరించి రాక్షసుని వంచించి నందరాజ్య విశేషంబు లెప్పటికప్పుడు గూఢచారులచేఁ దనకు వర్తమానింపుచుండఁ గోరి యాతనికి క్షపణకవేషము వైచి నందరాజ్యమునఁ బ్రవేశపెట్టెను. ఆతఁడును గాలక్రమంబున రాక్షసుని ప్రాపకము గడించి యచటి రహస్యంబులన్నియుఁ జాణక్యునకెఱింగింపుచుండెను. ఇటఁ జాణక్యుఁడన్నను పాటలీపుత్రమునకు సమీపంబునందున్న పర్వతుండను మ్లేచ్ఛరాజుతో మైత్రి నొనర్చి, యాతనిని నందసామ్రాజ్యముపై దండయాత్ర వెడలఁ బ్రేరేచెను. జయానంతరంబున నందసామ్రాజ్యమును జెఱిసగముగ బుచ్చుకొను నటులఁ జంద్రగుప్త పర్వతులు నిర్ణయించుకొనిరి. పరసర రాజ్యముల నుండియు సామంతప్రభువుల కడనుండియు సైన్యములను సమకూర్చి చాణక్య నిర్దిష్ట శుభముహూర్తంబునఁ జాణక్య చంద్రగుప్త ప

ర్వతులు పాటలీపుత్రముపై దండయాత్ర వెడలిరి. ఇచట నం దులును సంరబ్ధులై మంత్రిరాక్షసయుతులై యుద్ధమొనర్ప సిద్ధమయిరి. పలుతెఱంగులఁ బ్రయత్నించియు వైరివీరులఁ జక్కాడశక్తిలేమి రాక్షసుండు చంద్రగుప్తుని గుప్తవిధానం బునఁ జంప నుద్యమించెను. కాని యా నందులు పర్వతేం ద్రబలానిలముతో విజృంభింపఁబడిన చాణక్య చంద్రగుప్త క్రోధానలంబున శలభంబులవలె పడి దగ్ధులైరి. ప్రతిజ్ఞాపాల నానంతరమునఁ జాణక్యుండు శాత్రవరక్తసిక్త హస్తంబులతో శిరోజముల ముడివైచుకొనెను.

## —♦ చంద్రగుప్తుని రాజ్యప్రాప్తి ♦—

అటులాహవరంగంబున సర్వనందులు చాణక్యుని నిశితకరవాలమునకు బలియగుట రాక్షసుండు గాంచి క్లేశ పరవశుఁడై, బలపౌరుషనష్టుఁడై, ప్రాణత్రాణపరాయణుఁడై, నందవృద్ధుండగు సర్వార్థసిద్ధుని రహస్యమార్గంబునఁ బురం బుఁ దాటించి పౌరులఁ బురికొల్పి చెదరిన సేనలఁ జేర్చికొని పర్వతు నెదుర్కొనెను. కాని యాతని సైనికులాహవంబు నం ద్రెళ్లిరి. అంతటితోనైనను రాక్షసుండు తన ప్రయత్న మును మానక పాటలీపుత్ర పౌరుల హృదయంబులఁ జంద్ర గుప్త చాణక్యులపై ద్వేషబీజంబుల నాటెను. ఈసమయంబుఁ గనిపెట్టి పర్వతుఁడు చంద్రగుప్తుని గీటడంచి నందసామ్రా జ్యము నంతయుఁ దానొక్కరుండ కాఁజేయసిద్ధమయ్యెను.

ఈ విప్లవపరిస్థితుల నెల్లఁజాణక్యుఁడు గ్రహించి వానినుం
డి యెప్పటికప్పుడు చంద్రగుప్తుని దప్పింపుచుఁ గంటికి ఱెప్ప
వోలెఁ గాపాడుచుండెను. రాక్షసుండెటులయినను జంద్ర
గుప్తుని గపటోపాయంబున మట్టుపెట్టఁ దగిన నుపాయము
లూహింపుచుండెను. ఆహవరంగంబున మరణించిన నందుల
కుచితమయినతర్పణంబు చంద్రగుప్త చాణక్య పర్వతేశ్వరా
దులవధయేయని నిశ్చయించి దాని నెరవేర్చుటకు యుద్ధసా
ధనములన్నియు వ్యర్థంబగుటచేఁ గపటసూత్రంబులఁ బెక్కు
లువన్నెను. అందు మొట్టమొదటిది విషకన్యా ప్రయోగము.
రాక్షసుండు చిన్ననాఁటినుండియు నొక స్త్రీశిశువును సాఁకు
చు నాపెకుఁ గ్రమక్రమముగ నల్పమునుండి యధికముగ
విషపుగుళికల మెసవనిచ్చుచు జీర్ణించికొనునటులలవఱచి
విషపూరితగాత్రిఁ గావించెను. అబ్బాల యిపుడు యుక్తవ
యస్కయయి జగన్మోహనాంగివలె నుండెను. జీవసిద్ధియను
నామంబున నొప్పి క్షపణక వేషధారియై విశ్వాసపాత్రుఁడై,
దైవజ్ఞుఁడై, యాశ్రితుఁడై యుండిన నిందుశర్మను సమీపిం
చి బహుగతుల స్తోత్రములొనరించి సందేశమును గొని
పోవ సమ్మతింపఁజేసి విషకన్య నాతని స్వాధీనముఁగావించి
చంద్రగుప్తునకు దన క్షమార్పణ సూచకంబుగ నాయమఁ
గొని యర్పింపుమని వేడెను. ఇందలి రహస్య మాతఁడు గ్ర
హింపఁ జాలమి సమ్మతించి యాపెంగొని చాణక్యుని సన్ని

ధికరుఁగఁ జంద్రగుప్తుండు పరస్త్రీవాంఛాజనితుండుగాఁడని యు నందులకుఁ దగినవాఁడు పర్వతేశ్వరుండేనియు, నాతనికొ సఁగిన మహదానందంబున గ్రహించుననియుఁ, దెలిపి వా నికొసఁగఁగోరెను. ఇందుశర్మ యటులఁ గావింప వివేకహీనుఁ డు కామాతురుండునగు నాపర్వతుండు నాకామినీమణిని స్వీక రించి విషప్రస్తుండై మరణించెను. చాణక్యుండిట్టులొనర్చు టలోఁ జంద్రగుప్తుని రక్షించుటయు నందసామ్రాజ్యము నం దర్ధభాగమీయ నగత్యములేకుండఁ జేయుటయు సూచించుచుండెను.

అటులఁ బర్వతుండు మరణించినవార్త రాక్షసుం డువిని యటకుండాను జ[illegible] వానపుత్త్రుండగు మలయకేతుని తో[illegible] మైత్రి నొనర్చి [illegible] చి [illegible]నటి కేగి పాటలీపుత్రమును ముట్టడింప మలయకేతువు బ్రోత్స హించుచుండెను. జీవసిద్ధినామాంకితుండగు నిందుశర్మ చాణ క్యపక్షపాతంబున రాక్షస మలయకేతులకు భిన్నభావంబు లుదయింపంజేసి వానితండ్రియగు పర్వతుని మరణమునకా రాక్షసుండే కారణుండని నమ్మునటుల మలయకేతున కుప దేశించెను. రాక్షసముద్రికను రహస్యంబుగ సంపాదించి కొన్ని పత్రికలఁ గల్పించి రాక్షసుఁడు వెలువర్చినటులొనర్చ మలయకేతునకు రాక్షసునిపై ద్వేషభావము మెండ య్యెను. ఈ విషమ పరిస్థితులఁ [illegible]చి యసయుద్యమము సభ

లము గాదని నిశ్చయించి పాటలీపుత్ర నగరాభి ముఖుండ య్యెను. రాక్షసుండు దేశసంచారియగుటయు, మలయ కేతుండు నిజదేశంబున కరుగుటయు విని చాణక్య చంద్రగుప్తులు జయజయ ధ్వనులు సెలంగ మహాసంరంభంబుతోఁ బాటలీపుత్రముఁ బ్రవేశించిరి. రాక్షసుండూరు వెడలునపుడు గర్భవతిగనుండిన నిజకళత్రంబును గుమారునిఁ దన యనుంగు మిత్రుండగు జందనదాసుగృహంబున భద్రపఱచ నాసంగతిఁజాణక్యుఁడుగ్రహించిచందనదాసునిరప్పించినీయిం టనుండిన రాక్షసుని దారాపుత్రులఁదెచ్చి యొప్పగింపుమన నాతండు రాక్షస పక్షపాతియగుటను నటులఁ గావింపనొల్లమిఁ జాణక్యుఁడు చందనదాసును వధ్యస్థానంబునఖండింప నాజ్ఞాపించెను. ఈవార్త రాక్షసుఁడువిని నిజ ప్రియామిత్రుండగు చందనదాసుని ఘోరమరణమునకుఁ దానె కారకుండనని యెంతయు విచారించి పాటలీపుత్రమునకేగి మిత్రుని రక్షింపఁ జాణక్యునిఁ బ్రార్థించెను. అంతట మగధసామ్రాజ్యమునకు మంత్రివైయుండుట కంగీకరించినయెడలఁ జందనదాసుని ప్రాణముల గాపాడెదననియు, నింతకుమున్నొనరించిన తప్పిదంబులనెల్ల క్షమింతుననియుఁ జాణక్యుండువలుక మగధసామ్రాజ్యక్షేమమె తనకు ముఖ్యకర్తవ్యమని యెంచిన రాక్షసుండు చంద్రగుప్తునకు మంత్రిగా నుండనియ్యకొని చందనదాసును మరణమునుండి తప్పించెను. అంతఁ బౌరులసమక్షం

బున నా చంద్రగుప్తాభిధానునొక శుభముహూర్తంబునఁ బట్టాభిషిక్తుం గావించి తనద్వితీయ ప్రతిజ్ఞా నిర్వహణముఁ గావించి రాజామాత్యుల కనువగు హితములుపదేశించి తత్త్వవిచారము నొనర్పఁ దానరణ్యముల కేగెను.

ఈ నీతికోవిదుఁడు ముద్రారాక్షసమున ముఖ్యపాత్రము గనుండి పరిస్ఫుటజ్ఞానము, నాత్మవిశ్వాసము, యుక్తి వైశాల్యము, తంత్రోపాయ ప్రాబల్యము, నిరంకుశనీతిశాస్త్రనైపుణ్యము, దీర్ఘాలోచనము, నిర్ణీత ఫలప్రాప్తికి వలసిన సర్వకార్య కర్తృత్వమును బ్రదర్శించెను. ప్రతిజ్ఞా భఁగకరములని తోఁచిన పట్టుల దయాదాక్షిణ్యముల కిసుమంతయుఁ దావొసంగక నిజసమయంబును బాపునట్టి రాజకీయాడంబరములఁ గలనైనఁ దలంపక, యధికారమదము గన్నులఁదట్టి మన్ను మిన్నెఱుంగక యుచితానుచితములవీడి కులమతాచారంబులఁ ద్యజించి విదేశాచార పిశాచావేశులై జన్మమధ్యంబునందొక్క మాఱేని కేశవాయని యెఱుంగక కులభ్రష్టులుగాఁ జూపట్టు టకారత్రయము ధరించి వర్ణాచారవ్యవహారంబులఁ గన్పట్టు టకారత్రయము విసర్జించు నిప్పటి నవనాగరికులవలెఁ గాక పర్ణశాలలయందు నదీతీరములయందు విధివిధానముల ననుసరించి త్రేతాగ్ని సంరక్షణాది విహితకర్మ లాచరింపుచు బ్రాహ్మణవృత్తి పరుండయి రాజనీతిధురంధరుండయి, నీతి యుక్త పథసంచారియై, బ్రాహ్మణా

త్రధర్మముల సమ్మేళనముఁ గావించి శాంతోగ్రాశ్వంబులఁ బూన్చిన శకటంబును ద్రోలు సారథివగిది సంచరించెను. ఈ మహాశయుండు కుటిలుండని యెంచితిమేని మన పురాణంబులఁగల మహాపురుషులతోఁదుల్యుండనియే యెంచవలసి యుండును. ఏలనన శ్రీరాముఁడు సుగ్రీవ విభీషణాదుల నను మోదించుచు వాలిరావణులపైఁ జూపినది కౌటిల్యము. వాలిసుగ్రీవులు పోరుచుండఁ జెట్టుచాటుననుండి వాలినేసినది కౌటిల్యము. పూతనాది దుర్యోధనవధ పర్యంతము శ్రీకృష్ణుఁడొనర్చినది కౌటిల్యము. భీష్మద్రోణ కర్ణులఁ బరిమార్ప శిఖండి యుధిష్ఠిరార్జునులు గావించినది కౌటిల్యమని చెప్పక తప్పదు ఇట్టి కౌటిల్యము కేవలముధర్మపథగాములకుఁ గర్హణీయంబయినను రాజనీతి మెలంగువారల కవశ్యాచారణీయమని చెప్పక తప్పదు. ఏదియెటులున్నను మొత్తముమీద నీతండు మహామేధాశాలియై ప్రతిజ్ఞాపాలనా దక్షుండై బ్రహ్మచర్యవ్రతుండై జపతపస్స్వాధ్యాయ వేత్తయై కవిసత్తముఁడయి పెక్కు నీతిశాస్త్రముల రచియించెననుట కావంతయు సందియములేదు. శుక్ర నీతిమొదలగు గ్రంథములవలెనే చాణక్యుని నీతిగ్రంథములను గూడ నీతిశాస్త్ర వేత్తలు ముఖ్యగ్రంథములు గఁ బరిగణింపుచుండుటయే యీతని ప్రతిభకుఁ దార్కాణ మగుటం జేసి యీమేధావి చిరస్మరణీయుఁడు.

# ౧ తిమ్మరుసు మంత్రి.



"సీ॥ ఏమంత్రిమణి నిజ ♦ స్వామి కార్యక్రియా
తత్పరమాన సో ♦ త్సాహశాలి
యేమంత్రిమణి మిత్ర ♦ హిత వాంఛనాశ్రిత
ప్రకరరక్షణ కళా ♦ ప్రౌఢబుద్ధి
యేమంత్రిమణివచో ♦ హేలాతి నైర్మల్య
శీతలతాధూత ♦ శీతరోచి
యేమంత్రిమణి సుధా ♦ ధామ శాంభవదాము
ధాళధళ్యసుతుల్య ♦ ధవళకీర్తి
గీ॥ యట్టి మంత్రికులోత్తంస ♦ మహితనృపతి
పటల మకుటాగ్రఘటిత పా ♦ ద్పద్మయుగళి
సకలకర్ణాట దక్షావి ♦ చక్షణుండు
దీనసురశాఖ సాళువ ♦ తిమ్మమంత్రి॥"

[నాడయ గారి మల్లనకవి]

ఆంధ్రదేశమునం దమాత్యపదవి నధిష్ఠించిన వారిలో నగ్రగణ్యుండై, యసన్య సామాన్య శేముషీ ధురంధరుండై, యవక్రపరాక్రమోపేతుండై, యద్వితీయ ప్రభుభక్తిపూరిత హృదయుండై, యమేయ దేశాభిమాన గాత్రుండై, సాహసౌదార్య ధైర్య గాంభీర్య చేతస్కుండై, యప్ర

తిమాన ప్రతాపశాలియై, సురుచిర వాగ్విలాస భూషణుం డై, యనర్గళ కవితాప్రాభవుండై, యకలంక రాజనీతి కళా ప్రవీణ్యుండై, యాహవరంగంబున నరివీరుల నుత్సాత లాడించి యఖండకీర్తి గాయుండగుమంత్రి తిమ్మరుసుయొక్క పవిత్రచరిత్రము పురోవృద్ధికాముల కవశ్యపఠనీయము.

## —♦ వం శ ము. ♦—

ఈమంత్రి శిఖామణియొక్క పూర్వులు సాళ్వవంశ సంజాతప్రభుల చెంత మంత్రిత్వాది పదవులధిష్టించి సుప్రఖ్యా త ఖ్యాతియుతులగుట నీతని వంశము సాళ్వవంశమని పిలు వంబడఁజొచ్చెను. ఈతని స్వస్థానము కొండవీటిసీమ. కౌండి న్యస గోత్రజుఁడు. ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. వేమ రాజ పౌత్త్రుఁడు. రాచిరాజ పుత్త్రుఁడు. తిమ్మరాద్యభిధా నుఁడు. కర్ణాటభాష యందరుసుశబ్దము రాజశబ్దమునకుఁ బర్యాయపదమగుటంజేసి యీతండు తిమ్మరుసనియే వ్యవ హరింపఁ బడుచుండెనఁట. ఈతని పితృపితామహులు కర్ణాట సామ్రాజ్యస్థ సామంతనృపాలాస్థాన మంత్రిపుంగవులుగ నుం డిరి. కాని కొండవీటి రాజ్యమును నుదయగిరి రాజ్యమును గ జపతు లాక్రమించుకొనుటంజేసి మన కథానాయకుని తం డ్రియగు రాచిరాజే విగత విభవుండై చంద్రగిరికి వలస

పోయెను. అనంతర మీరాచిరాజునకుఁ దిమ్మరుసు, గోవిందరాజు నను నిద్దురు కొమరులును కృష్ణమాంబయను నొక కొమరితయు జనించిరి. రాచిరాజు తన తనూజాతను నాదెండ్ల చిట్టిగంగనామాత్యునన్న మనుమండగు తిమ్మరాజున కొసంగి పరిణయముఁ గావించెను. ఈ సోదరద్వయము బాల్యంబునందుండఁగనే మాతాపితలు మరణించిరి. తదాదిమాతులుండే వీరి పోషణభారము వహించి దేశకాల పాత్రానుకూల్యంబగు విద్యను నిజగ్రామంబున నభ్యసింపఁ జేయుచుండెను.

## — బాల్యము —

రామలక్ష్మణులో, బలరామకృష్ణులో యను నటులీసోదరద్వయము మాతామహుని గృహంబునఁ బెఱుగుచు విశ్రాంతి సమయంబుల సమీపస్థవనవాటులకుంజని నైసర్గిక రామణీయకంబుంగాంచి భగవల్లీలా విలాసంబున కెంతయు నాశ్చర్య మానసులగుచు భోజనప్రాంతంబులకు వలసిన పత్రంబుల సేకరించి గృహోన్ముఖులగు నాచారముండెడిది. ఇటులుండ నొకనాఁడు తిమ్మరుసు సమీపవనమునకుంజని యందందు విహరించి, మధ్యందినమార్తాండాతపంబున కలసి యొకరసాల భూరుహచ్ఛాయఁ బరుండి నిద్రించుచుండ భానుండపరదిశ కరుగుండు భాస్కరాతప మీబాలుని ముఖమండలంబునఁ బర్వ నాతని కెండ సోఁకకుండునటుల నొకభుజం

గంబా రసాల వృక్షంబుచెంత కేగి తన ఫణమువిప్పి ఛత్రము భంగి నడ్డముగఁ బట్టియుంచెను. ఆ పరిసరప్రాంతంబుల నొం టరిగ సంచరించుచుండిన సిద్ధుండొండీచిత్రముఁ గాంచి యద్భుతమానసుండయి, యాబాలుని సన్నిధికరిగి నిద్రలేపి "అర్భకా! నిర్భయంబుగ నిట్టియరణ్యంబుల నొంటిగఁ దిరుఁగాడకుము. అనతికాలంబున నీవత్యధికైశ్వర్య యుతుండవై దేశక్షేమసంధాయకుండవగుదువు. వైశమ గృహాన్ముఖుండవగుము."అని పలుక నాబాలుండు మేల్కాంచి యాతనిపలుకులవిని యింటి కేగుచు మార్గమధ్యంబున మనమునందిటులఁ జింతింపఁ దొడంగెను. "ప్రపంచంబునంగల యా గర్భదరిద్రులలోఁ బ్రిప్రథముఁడనగు నాకును నధికైశ్వర్యయుతంబగు దేశక్షేమ సంధాయకమునకును హస్తిమశకాంతరము గలదు. ఇట్టి నిర్భాగ్యున కట్టి మహదైశ్వర్య పదవి లభించుట కేవలము మిధ్య. అసంభవము. అసంభవ మెట్లగును? "కృషితో నాస్తి దుర్భిక్ష"మ్మన వినమె? ప్రయత్నించినచో మానవునకసాధ్యమెద్ది? ఏమో! భగవంతుఁడు నాకట్టిపదవి నొసంగఁ దలఁచెనేమో! కాని యా పదవిని సంపాదింపవలె ననిన విద్యాధనము ముఖ్యసాధనము. ఎట్టి కష్టముల లోనయినను విద్య నార్జించితినేని ధనము దానంతటనదియే సమకూరఁగలదు. వాక్పారిశుద్ధ్యముగల యాసిద్ధుని వాక్యములు రిత్తయగుటెట్లు? ఈదినము మొద

లధిక ప్రయత్నమొనర్చి విద్యనునేర్చి యాసిద్ధుని వాక్యములు సిద్ధించునటుల నధికైశ్వర్యపదవిఁ బడసెద”నని యనుకొనుచుఁ బురంబునకుఁజని యొక్కడ బాలకులతో నాడుకొనుచుండిన సోదరుండగు గోవిందరాజుఁగని య త్యాదరమునఁ జేరంజని సిద్ధునివాక్యము లాతనికిం దెలుప సంగాతకాంద్రాపలుకులువిని యందఱన్నివిధముల నాతని హేళన జేసిరి. వారిమాటల నాతఁడు లక్ష్యముసేయక వారియెదుటఁ దాను సిద్ధునిమాటల వెల్లడించుటయే నిజదోషముగా గ్రహించి తమ్మునితో నింటికింజని సోదరి నత్తింటికనిపి తామిఁకఁగాలము వ్యర్థముగాఁ గడపరాదనియు, నెవ్వఁడీప్రపంచంబున బహుజనోపకారియైవర్తించునో యాతఁడే యుత్తమ పురుషుండనియు, వాని జన్మమే సార్థకమనియు, నట్టివానికీర్తియే శాశ్వతమనియు, విద్యాధనములు గలవానిని లోకము గౌరవించుననియు, ముందీరెంటిని నార్జింపవలె ననియుఁ, జెడి బంధువులదరిఁ జేరుటకంటె విద్యా సము పార్జనమునకై మాధుకరవృత్తి యుత్తమసాధనమనియు, నాలోచించి దృఢసంకల్పచిత్తులై యాసోదరు లిరువురేరికిం దెలుపకుండ నాఁటిరేయియే యొందేనింజనిరి. కాని పాపమాసోదరులు బాల్యంబుననే తలిదండ్రులు లేనివారగుటంజేసి దారిద్ర్యమను భూతము నెదుర్కొనవలసినవార యిరి. దరిద్రమనునది సాధారణ విషయముగాదు. అష్ట

కష్టములొసంగి మనుజుల నలఁచివేయునది దారిద్ర్యము. మనో నిబ్బరములేనివానిఁ గలఁచివైచున దీదారిద్ర్యమే. ఎట్టిసత్యవంతుఁడైన నీపిశాచావేశుండగుచో సత్యదేవతకు దాసోహమ్మన వలసినదియే.

దరిద్రదేవత తలఁబట్టెనా పోటుబంటు పిఱికిబంటు ను, వివేకి యవివేకియు నయి దుఃఖపరంపరలకు లోనయి యాత్మగౌరవమునకు దూరుండయి, నికృష్టుఁడయి లాఘవా స్పదుడయి నామమాత్ర ప్రయోజనపరుండగుట నిశ్చయ ము. జితేంద్రియులు, నుద్యోగులు, దైవభక్తికలవారు మా త్రమె దారిద్ర్యభూతమును బాఱఁద్రోలఁగలరు. ఈ యన్న దమ్ములిరువురిట్టి ప్రతిభావంతులగుటచేఁ దమ్మావేశించియుం డిన దరిద్రతాభూతము నావలకుఁద్రోలి స్వయంకృషిచే నుద్దిష్టకార్యమున విజయమువడయ యత్నించిరి.

## —♦ విద్యాభ్యాసము. ♦—

రామునెడల లక్ష్మణుఁడు వర్తించిన విధంబున గోవిం దరాజు తిమ్మరుసునెడలనత్యంత భక్తితాత్పర్యంబులుగలవాఁ డయి విశ్వాసముజూపుచు నన్నమాట కడుఁగుదాఁటక మె లఁగుచుండెను. ఆయన్నదమ్ములనుదినము సూర్యోదయా త్పూర్వమెలేచి కాల్యకృత్యంబులఁదీర్చి స్నానసంధ్యావంద నాద్యనుష్ఠానము లాచరించి, యుపాధ్యాయులచెంతఁ గావ్య

పఠన మొనర్చి, యసరాహ్ణాంబగుడు వారిలో నొకఁడు మా ధుకరవృత్తిచేఁ గొనితెచ్చిన ప్రసాదమును స్వీకరించి, కొం తవడి విశ్రమించి, తాళపత్రలేఖన మొనర్చి రాజకీయోద్యో గులకడకేగి వారిప్రాపుఁ బడయఁ దన్నియమితకార్యములొ నర్చి, సాయంకాలంబుల వాహ్యాళివెడలి ప్రకృతిసౌందర్యా నంద మనుభవింపుచు, రాత్రులందింటియొద్ద రామాయణ భారతాది గ్రంథపఠనముఁ గావింపుచైదారువర్షములలో సంస్కృతాంధ్రభాషలఁ జక్కనిపాండిత్యముఁబడసిరి. పండితు లసన్నిధిని శుశ్రూషలుసల్పి శాస్త్రాభ్యసనముఁ గావించిరి. గణితశాస్త్రంబునందుఁ బ్రావీణ్యముఁ బడసిరి. ఆయిరువురఁ దిమ్మరుసుసూక్ష్మతరగ్రాహ్యుఁడగుటచే గోవిందునికంటె మే ధావియై యొప్పెను. "ఆరోగ్యమే మహాభాగ్యమ్మ"ను నీతి వాక్యానుసరణిఁ దమ దేహారోగ్యమును గాపాడుకొనుచుఁ గదనరంగమున కుపకరించు ధనుర్విద్యా పాటవముల.బడసి, కుంతతోమరఖడ్గప్రయోగాదివిద్యల సముపార్జించి "శరీర మాద్యం ఖలుధర్మసాధనమ"ను ప్రమాణము ననుసరించి శ రీర వ్యాయామముఁజేసి దృఢకాయులై, కర్ణాటక సాంప్ర దాయ చరిత్రలఁబఠించి, విశేష ప్రతిభా శాలులయి, దయా హృదయులయి పరిసరపట్టణంబులయిన, గుత్తి, పెనుగొండ, చంద్రగిరి, కార్వేటినగరము, నారాయణవనము మున్నగు పట్టణంబుల యశోవిరాజితులయిరి. అక్కాలంబునందర్థ శా

స్త్రమును బోధింపఁగల పండితు లతిస్వల్పముగనుండిరి. తిమ్మరుసా శాస్త్రపఠనముఁ గావింప నెక్కువ కుతూహలముఁ గలవాఁడయి యుండెను. కాని బోధకులీతనికి సులభసాధ్యులుగాకుండిరి. ఇటులుండఁ జంద్రగిరి ప్రభునికడ నమాత్యపదవియందుండినఁ శబ్బదిసంవత్సరముల వయసుగలిగిన, బుద్ధివైశద్యముఁ బడసిన, దేహపుష్టిఁగలిగిన నాదెండ్ల చిట్టిగంగన యీబాలుర ప్రఖ్యాతినివిని వీరలఁ దననివాసమగు నారాయణవనమునకు రప్పించి, తదాస్థానంబున లేఖకులుగ నియమించెను.

## ఉద్యోగ ప్రాప్తి

ఆసోదరు లిరువురు చంద్రగిరిరాజు దివాణంబున లేఖకులుగఁ బ్రవేశించి, స్వల్పపదవులయందుండినను, నున్నతోద్యోగీయుల దయనుబడసి, యందఱికనువర్తనులై తలలోని నాలుకవలె మెలఁగుచుఁ దమ ప్రజ్ఞావిశేషంబుల వెలయించుచుండిరి. అక్కాలంబున సర్వశాస్త్ర పండితుడయిన జిట్టిగంగనామాత్యుం డందఱకు సులభసాధ్యుండు గాకున్నను వారి వినయవిధేయతలఁ గాంచి హర్షించి, వారు రాజనీతిఁ బఠించిన మహోన్నతపదవికి రాగలరని తలంచి వారియెడల నవ్యాజానురాగ సంజనిత హృదయుండయి తిమ్మనా

ర్యుని రప్పించి యాత్మగతము వానికెఱింగించి, యిట్లనియె. "నాయనా? నీవంటిసమర్థుఁడు నాకెందును గన్పట్టఁడు. నేను వృద్ధుండనైతి. నాకుం దెలిసిన రాజనీతిశాస్త్ర రహస్యంబుల నీకుం దెలిపి నిన్ను రాజనీతిశాస్త్రకోవిదుఁ గావింప నెంచితిని. హైందవ రక్షణార్థము స్థాపితమయిన యీరాజ్యము నశింపకుండ, మ్లేచ్ఛులస్వాధీనము గాకుండఁ జేయవలసిన భారము నీపైనున్నది. నీమేనఁ బ్రాణములున్నంతదనుక నీవిషయమును మఱువకుము" అని హితబోధన మొనర్చెను. అంత నాసోదరద్వయముఁ దమయసమానధీవిశేషంబున గుత్తి, పెనుగొండ, చంద్రగిరి దుర్గములఁ బాలింపు తుళువనరసరాణ్మహీపాలు నాస్థానంబునఁ జ్యేష్ఠుం డమాత్యుండుగను, గనిష్ఠుండు దండనాధునిగను నియమింపఁబడ నాపదవులం బడసిరి. ప్రభు చిత్తవృత్తి నెఱింగి రాజ్యాభివృద్ధిఁ గావింపుచుఁ బ్రభుసన్మానములం బడయుచు గంగనామాత్యుని చెంతఁ దిమ్మరుసు మంత్రి యర్థశాస్త్ర రహస్యములను, రాజనీతి మర్మములను గఱచి సమయోచితజ్ఞుఁడై మెలఁగుచుండెను. ఈగంగనామాత్యుండీ మేధానిధియగు తిమ్మరుసునకు వలసిన కౌటిల్యుని యర్థశాస్త్ర మర్మముల బోధించి, కామందకుని నీతి సారమును జదివించి, తంత్రియుక్తులుమున్నగు మహద్విషయంబులఁ బ్రజ్ఞాఢ్యునిగావించి సంపూర్ణ ప్రజ్ఞాన్వితుగాఁ జేసెను.

## —♦ విద్యానగర సామ్రాజ్యమునఁ దిమ్మరుసు ప్రవేశము ♦—

చంద్రగిరి దుర్గంబునం దమాత్య దండనాధికారపద వులంబడసిన తిమ్మరుసు గోవిందరాజుల వివాహానంతరమున గంగనామాత్యుండు కాలధర్మమందెను. అచిరకాలంబునఁ దిమ్మరుసుయొక్క ప్రజ్ఞావిశేషములు రాజ్యమున వ్యాపించి సర్వజనశ్లాఘా పాత్రములై యెల్లెడల కాతని యశోవైభవమును విస్తరింపఁ జేయుచుండెను. ఇక్కాలంబున విద్యానగర సామ్రాజ్యమును భోగలాలసుఁడు. నవివేకి, చపలచిత్తుఁడు, మూర్ఖుఁడునగు నిమ్మడి విరూపాక్షరాయలను క్షత్రియుఁడొకండు పాలింపుచుండెను. ఆతని పాలనాసౌష్ఠవరాహిత్యంబున దేశంబునం దలజడులు మెండయి, ప్రజ లష్టకష్టంబు లనుభవింపుటం జేసి ప్రభుభక్తి శూన్యులయి సమయము దొరకినపుడెల్ల నెదిరింప సిద్ధమయి సింహాసనాభ్రష్టుఁ గావింప సిద్ధమైయుండిరి. పాలకపాలితు లన్యోన్య ప్రేమానుపాశబద్ధులుగాని నాఁడు దేశ పరిస్థితులు విషమించుట సిద్ధము గదా! అన్యోన్య వైరబీజము లంకురింపు సమయమునకై వేచి దేశము నాపోశనముఁబట్ట సిద్ధముగనున్న యప్పటిమహమ్మదీయ ప్రభువులీపరిస్థితులఁ గన్పట్టి దేశమును హరింప యుద్ధమునకు సిద్ధమయిరి. ఇంతకుమున్నె కళింగదేశాధీశుల యిన గజపతు లుదయగిరి రాజ్యమును స్వాధీనము గావించికొని పాలింపుచుఁ గర్ణాటసామ్రాజ్యాపహారణమునకై

వేచియుండిరి. చంద్రగిరి, పెనుగొండ, గండికోటరాజ్యముల నాక్రమించి తుళువగుండ, నరసింహభూపాలుడ క్షీణ పరాక్రమ దక్షుండై జనరంజకముగాఁ దిమ్మరుసుమంత్రిసాహాయ్యంబునఁ బ్రసిద్ధిఁ బడయుచుండెను. కర్ణాటసామ్రాజ్యమిట్టి మహావిప్లవ పరిస్థితులనడుమఁ జిక్కి యావయుచుండెను.

తుళువ నరసరాయల యాస్థానంబున మంత్రిగానుండిన ధీవిశాలుండగు మన తిమ్మరుసు విద్యానగర విప్లవ పరిస్థితులఁ దెలిసికొని యుపేక్ష మానిన తన పురోభివృద్ధికిఁ గారణుండయిన గంగనామాత్యుని హితబోధనను మఱువక హైందవ సామ్రాజ్యము నుద్ధరింప హైందవుండగు దనకు విధ్యుక్తధర్మమని నిశ్చయించి, హైందవ సామ్రాజ్యము బహమనీ సుల్తానుల వశమయ్యేనేని సామ్రాజ్యమంత మంది, తన్మతధర్మములు నశించునని యూహించి, యదియే యదనని నిశ్చయించి ప్రభువును బుఱికొల్పి యసంఖ్యాక వీరసైనికా నికాయంబుతోఁ గర్ణాటసామ్రాజ్యము పై దాడి వెడలఁ బ్రేరేచెను. ప్రభువర్యుఁ డీయమాత్య పుంగవుని ప్రోత్సాహవాక్యంబులకుఁ గడు సంతసించి నిజమంత్రివర్గమునకును, దండనాధులకును సందేశముల నంపి వారలరప్పించి తిమ్మరుసు వాక్యములఁ దెలుపవారలందఱు సమ్మతించి యా తిమ్మరుసుమంత్రి యొక్క బుద్ధివైశద్యమును బ్రశసించిరి. అంత సాళువ నరసింహభూపాలుండు విద్యానగరమ్ము

పై దండయాత్ర వెడల సైన్యాధ్యక్షున కాజ్ఞాపత్ర మొసం
గి చంద్రగిరి, పెనుగొండ దుర్గంబుల భద్రపఱపించెను. నర
సింహక్షితీంద్రు డాజ్ఞాపత్రమును దిమ్మరుసు చదివికొని
తాఁ దలపెట్టిన కార్యమున కెల్లరా మోదింపుట భావిశుభ
సూచనంబుగ గ్రహించి యత్యంతానంద స్వాంతుఁడై ప్రతి
పక్షులకుఁ దెలియకుండ రహస్యంబుగ దాడి వెడలునటుల
సర్వసైన్యంబుల సిద్ధపఱచి యొక శుభముహూర్తంబునఁ జ
తురంగబలసమన్వితముగా నరసింహ ప్రభునితోఁ దానుగూ
డ నుండి విద్యానగరము పైదాడి వెడలెను. కర్ణాటరాజ్య
సంరక్షణ భారము వహించిన దండనాథులకును సామంత
నృపాలురకును దాను వచ్చిన కార్యమును నివేదింప నంతకు
మున్నె తిమ్మరుసుమంత్రి యొక్క ధైర్యసాహసములు విని
యున్న వారగుటచే నాతనితోఁ బోరాడ వెఱచి మిన్నకుం
డిరి. అటుల దండనాథులెల్లరు మౌనము వహించి యుంట
చే నగరమున కెట్టినష్టము లేకయే నగరప్రవేశము నరసిం
హరాజునకు సులభ సాధ్యమయ్యెను. కర్ణాటప్రభువు శత్రు
రా కను విని రహస్యమార్గంబునఁ దప్పించికొని యసువుల
రక్షించుకొనియెను. నరసింహరాజు పురమునంతయు మహా
విభవంబున నూరేగి రాజభవనముఁ బ్రవేశించి నగరమునం
తను స్వాధీనము గావించికొనెను. విద్యానగరము సందలి
యే కొలఁదిమందికోయిది యనిష్టముగ నున్నను బహుళ

సంఖ్యాకుల కీమార్పు హర్షసంజనకముగ నుండుటం జేసి యా మోదమును బ్రకటించిరి. అటుల రాజ్యమును స్వాధీనము గావించుకొనిన నరసింహభూపతి సాళువ నరసింహావనీంద్రు నకు జయమును వర్తమానించి నగరము నందలి రాజబంధు వులను, గొందఱ పెనుగొండ దుర్గమునకును నింకఁగొందఱ గుత్తికిని, మఱికొందఱఁ బెనుగొండ మర్గమునకును బంపి, పు రము నందలి రాజకీయ సేవకులఁ దొలఁగించి యాస్థానముల నూతనాధికారులనే మించెను.

## —♦ ప ట్టా భి షే క ము ♦—

అంతఁ దిమ్మరుసుమంత్రి సాళువనారసింహుని ప ట్టాభిషేక మహోత్సవమునకు సామంత నృపాలురకు సే నాధిపతులకు నాహ్వానపత్రికలంపెను, సాళువనరసింహ భూ పాలుండు తనవారి జయమును విని యమితానందకందళిత హృదయారవిందుండై నిజపురోహితామాత్య సామంత నృ పాలవర్గంబుతోడను, నిజబంధుమిత్ర పుత్రకళత్ర పరివారస మేతంబుగ విద్యానగరముం బ్రవేశించెను. రాజ్యంబులో ని సామంతవర్గము పట్టాభిషేక సమయంబునకుఁ గానుకల నంపిరి. మఱికొందఱా మహోత్సవమును వీక్షింపఁ గౌ తూహలాయత్తచిత్తులయి విద్యాగరమున కేతెంచిరి. నిర్దే శిత శుభముహూర్తంబున సాళ్వనరసింహారాయలు కర్ణాట

సామ్రాజ్యపట్టాభిషిక్తుండయి మహారాజాధి రాజ రాజ పరమేశ్వర మూరురాయరగండేత్యాది బిరుదులవహించెను. మంత్రిసామంతాది వర్గంబెల్లగు నరసింహరాయలయెడనత్యంత వినయ విధేయులయి భయభక్తులతోఁ జరింపుచుండ సాళువ నరసింహక్ష్మాధవుండు 1486 వ సం॥రమునఁ గర్ణాట సామ్రాజ్యమునకు సార్వభౌముండయ్యెను. ఇంతటితోఁ గర్ణాట సామ్రాజ్యము పూర్తిగా నాంధ్రుల వశమయ్యెను. నిజమనోరథ సిద్ధిని బడయఁజాలిన తిమ్మరుసుమంత్రిని నరసింహరాయలనేకవిధముల సన్మానించి ప్రధానామాత్యపదవి స్వీకరింపఁ బ్రార్థించినను సమ్మతింపక తనకంటె వయోవృద్ధులును జిరకాలమునుండి భక్తిశ్రద్ధలఁ జూపుచుండినవారును మంత్రులుగ నుండఁగ వారలఁగాదని తానాపదవిఁ గైఁకొనిన మిత్రభేదమునకుఁ గారణమయి రాజ్యక్షేమమునకు భంగకరమగునని తెలిపి మంత్రిపదవిం గైకొనక రాజ్యక్షేమమునకై సదా పాటుపడుచుండెదనని రాజునకు వాగ్దత్తముఁ గావించెను. నరసింహ భూపతులిరువురు తిమ్మరుసుయొక్క బుద్ధికౌశల్యమునకు మెచ్చిరి. ఈతని ఖ్యాతి రాజ్యమునందెల్ల యెడల వ్యాపించెను.

కొంతకాలంబు జరుగ నొక్కనాఁడు సార్వభౌముండు తిమ్మరుసుంబిలిచి తనకుఁ బ్రబలశత్రువులు నశ్వపతులు నయిన బహామనీసుల్తానులను, గజపతులయిన కళింగదే

శాధీశ్వరులనోడించి తద్రాజ్యములఁగర్ణాటసామ్రాజ్యమునఁ జేర్చువఱకుఁదనకు నిద్రాహారములయందభిరుచి జనింపకుండె ననివారలజయించుసుపాయముఁదెల్పుమనఁబ్రస్తుతమంనులకు వలయుఁ జతురంగబలము లేదనియు, వస్త్రద్వయము దనకు వ్యవధినొసఁగినఁ దత్సాధనంబుల సమకూర్చి మనోరథసాఫల్యాగా నొనరింతుననియుఁ దిమ్మరుసు పలికిరాయల సమ్మతింపఁజేసి, యధికమగు ధనమును వెచ్చించి, యరబ్బీ పారసీక దేశములనుండి యశ్వముల రప్పించి, యాశ్విక సైన్యము నభివృద్ధిఁ గావించెను. కాని మనోరథసిద్ధిని బడయక మున్నె ధరాధిపుండు స్వల్పకాలమె రాజ్యమేలి దివంగతుండయ్యెను.

అటుల సార్వభౌముని మరణానంతరమాతని జ్యేష్ఠ సుతుండగు తిమ్మరాజుని గద్దెనెక్కించి సైన్యాధ్యక్షుండగు నరసరాజు, తిమ్మరుసుమంత్రి, కుడియెడమ భుజముల వలె రాజ్యరక్షణముఁ గావింపుచుండ నా యౌద్ధత్యమును గాంచి సహింపఁజాలని యొక దళవాయి యా బాలప్రభువును రహస్యోపాయంబునఁ గడతేర్చి రాజ్యాపహారణ కాంక్షచే సైన్యాధ్యక్షుండే యాపనిఁ గావించెనని వదంతి వ్యాపింపఁజేయ నాయపవాదమును దొలగించుకొను సాధనము నూహింపుమని తిమ్మరుసును సైన్యాధ్యక్షుండు వేడెను. అంతఁ దిమ్మరుసాదళవాయిని దుదముట్టింపుటయే ప్రథమ

కర్తవ్యమని తెల్పి బాలప్రభుని యనంతరము సింహాసనాధిష్ఠుండయిన సాళ్వ నరసింహభూపాలుని ద్వితీయపుత్త్రుండిమ్మడి నరసింహరాయుండనువాని చెంతకరిగి శత్రుసంహారముం గావింపం గోరెను. కాని యాప్రభువు మానమువహింప నాసైన్యాధ్యక్ష మంత్రులిరువురు రాజును భయపెట్టి యా దళవాయిని హతమొనరించిరి. అంతటితో సాళువతిమ్మనామాత్యుండు మహా ప్రధానియై రాజ్యతంత్రమునడుపుచు రాజ్యమునకంతకు మూలస్తంభ మయ్యెను. అతని యాజ్ఞయే మంత్రిసామంతాది వర్గంబునకు శిలాక్షరమైయొప్పెను.

## —♦ తిమ్మరుసుమంత్రి యద్భుతచర్యలు ♦—

రాజ్యమునంగల మహామ్మదీయ యోధుల భేదోపాయంబున జయించి, తిరుచునాపల్లిమండలేంద్రుండగు కోనేరినాథుని దుండగముల మాన్చి వశంవదునిగా నొనర్చి యాప్రదేశమాక్రమించి, బహమనీ రాజ్యభాగస్థులంతఃకలహంబులం దములోం దాము పోరాడుకొనుచుండ రాజ్యతంత్రజ్ఞుండయిన తిమ్మరుసువారి నెల్లర హతమొనర్చి సామ్రాజ్యమును వేయికన్నులం గాపాడుచుండెను.

కృష్ణా తుంగభద్రానదుల మధ్యభాగంబునంగల రాచూరు, ముదిగల్లు దుర్గములు సామ్రాజ్యరక్షణమునకుం గవచముభంగి నుండుటచేం గర్ణాటకప్రభువు తనకుం గావలె

వని యాశించియుండ విజయనగరసామ్రాజ్యమును ధిక్క-రింప సమర్థుండుగామి నాదిల్‌షాహా తటస్థుండై యుంటచే నాదుర్గద్వయమును దిమ్మరుసు స్వాధీనపఱుచుకొనెను. తిమ్మరుసుమంత్రి కోట ప్రాకారములను దుర్గములను బల పఱిచి, బొక్క-సము నభివృద్ధిఁగావించి, గజహయబలంబులఁ బెంపొందించి, సామ్రాజ్యమునఁగల యనుకూలురను, బ్రతికూలురను గ్రహించి వారినందఱ వశము గావించి కొనియెను.

దశరథక్ష్మాతలేంద్రుఁడు భార్యాత్రయముచే నెటుల శ్రమలందెనో యటులనే తుళువనరసింహరాయఁడు తిప్పాంబ నాగాంబ, ఓబాంబలను భార్యాత్రయమువలన నానా శ్రమలందుచుండెను. తిప్పాంబయందు వీరనరసింహదేవరాయఁడు నాగాంబయందుఁ గృష్ణదేవరాయఁడు, ఓబాంబయం దచ్యుతదేవరాయఁడు, రంగరాయఁడునను నలుగురు పుత్త్రులుదయించిరి. ఈ మువ్వురుభార్యల కలహము లంతరింపఁజేయుటకు నారసింహరాయుండు తిమ్మరుసు యొక్క- సలహాలఁ గైకొనుచుండెను. రాజ్యమునందుఁ బలెనె రాణి వాసమునందును సేవకానమూహమునందును, రాజబంధు బృందమునందును నెవరెట్టి గుణశీలవృత్తములు గల్గియుండిరో తెలిసికొని వారినందఱఁ దన ప్రజ్ఞావిశేషంబున విధేయులఁ గావించెను. తిప్పాంబ సపత్నీ కుమారుం

దగు కృష్ణదేవరాయండు తన పుత్త్రుండుండఁ దిమ్మరుసు సాహాయ్యంబున గద్దె నెక్కనే మోయను వెలపునఁ గృష్ణదేవరాయలఁ జంపింపఁ దలఁచి యనేకమాఱులు విషప్రయోగ మొనరింప దాసీముఖంబున నాజ్ఞాపింపఁ దిమ్మరుసా రహస్యమును గ్రహించి యాయుపాయంబులఁ దనయుపాయంబునఁ దప్పించి, వానిప్రాణములఁ గాపాడి వానిఁ దన చెంతనుంచికొని పరీక్షింపుచుండెను. కృష్ణరాయని ప్రాణములఁ గాపాడి విద్యాబుద్ధులు గఱపుచుండుటచేఁ దిమ్మరుసును గృష్ణదేవరాయలు నాయనగారని యర్థమిచ్చువటుల "అప్పాజి" యని సంబోధింపుచుండెను. తిప్పాంబ కుమారుఁడైన వీర నరసింహరాయఁడు గుటిలస్వభావుండై క్రూరవృత్తిఁ జరింపుచున్నను దిమ్మరుసాతని యువరాజుగా భావించి వానికి వలసిన రాజనీతిధర్మము లుపదేశింపుచు నఖండ ప్రజ్ఞాధురంధరుండయి యుగంధరునివలె సంచరింపుచుండుట వీర నరసింహరాయలు గాంచి తిమ్మరుసును బిత్రుసమునిగా నెంచి విధేయుఁడై మెలఁగుచుండెను.

కృష్ణదేవరాయలకేయపాయము రాకుండఁ గాపాడుచు సకల నీతిశాస్త్ర మర్మములాను పూర్వికగాఁ దిమ్మరుసు సోదరుండగు గోవిందరాజు నేర్పుచుండెను. రాయలష్టాదశ వర్ష వయస్కుండగునాఁటికే కొఱంతయు లేకుండ గోవిందరాజు రాయల సర్వవిద్యా సమధికుని గావించెను.

తిమ్మరుసుమంత్రి యాబాలునకు ధనుర్విద్య, నశ్వారోహ ణము, సాము గరిడీలను రాజనీతి దండనీతి రాజ్యతంత్ర ములు మున్నగువాని స్వయముగానేర్పి నిపుణునిగా నొనర్చెను.

క్రీ॥ శ॥ 1503 వ సం॥ మున నరసరాయుండు వ్యాధి గ్రస్తుండగుటచేఁ దన కనసానకాలము సమీపించినదని గ్రహించి తిమ్మరుసు మంత్రిని రప్పించి తన మరణానంత రము దనపుత్రులు కలహింపకుండునటులొనర్చి తన జ్యేష్ఠ సుతుఁడగు వీర నరసింహ దేవరాయనిఁ బట్టాభిషిక్తుఁ గావించి తనకాలంబునఁ దన యెడఁ జూపిన శ్రద్ధాభక్తుల వానియెడలఁ జూపుచు, సోదరు లన్యోన్యమైత్రి సంచరిం పునటులొనర్తునని వాగ్దానమొనర్చినఁ దానునాయాసమరణ మందుదునని పలుక తిమ్మరుసు వినయ వినమిత గాత్రుండై రాజాజ్ఞ శిరసావహింతునని పలికెను. అంత నరసింహరా యలు నిజపుత్రులనందఱఁ జేరఁబిలిచి హితబోధఁ గావించి తిమ్మరుసున కొప్పగించి యసువులఁ బాసెను.

అనంతరము వీర నరసింహ రాయండు సింహాసనా సీనుండై సామంతరాజులనుండి కప్పములు గొనుచుఁ బ్రజా పాలన మొనర్చుచుండెను. కాని తిమ్మరుసెప్పుడు మోసము నేసి కృష్ణరాయలకుఁ బట్టముగట్టునోయని యనుమాన చేతస్కుండై మాత్సర్యగ్రస్తుండై యుండెను. ఇటులుండినను

దిమ్మరుసుమాత్రి మెట్టిమస్బ్ఘసి గలిగియుండెను రాజభక్తి పరిపూరిత భావుండై రాజ్యరక్షణకు వలయు నేకలపరివారమును బూర్వమువలెనె వృద్ధిసేసి రాజునకు గప్పములు సెల్లించనివారల నుక్కడించుచు బ్రేరేచి కృష్ణదేవరాయల మైసూరు ప్రాంతములకు బంపెను. కృష్ణదేవరాయలు తిమ్మరుసు నియోగించిన కార్యములు నప్రమత్తుడై చరియించి జయంబువడసి మంత్రిశిఖామణి స్తోత్రంబులకు బాత్రుండయ్యెను.

వీర నరసింహారాయఁడు తిమ్మరుసునాన శిరసావహించి దక్షిణ దిగ్భాగంబునకుం జని కప్పములు చెల్లింప నిరాకరించినవారలఁ దొలఁగించి, వారస్థానములఁ గొత్త వారి నియమించి యొకటిరెండు సంవత్సరములలో శత్రుసంహారమొనర్చి, పితాజ్ఞ పాలించి యనవకరిపరాక్రముండయి పరిపంథిరాజుల సమయించి మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ, శేషభుజ క్షితిరక్షణశౌండ, పరరాజ భయంకరేత్యాది బిరుదములంది యారేంట్లు పాలించి కీర్తిశేషుండయ్యెను. అప్పటి కాతని కష్టవర్షప్రాయుండు తిరుమల దేవరాయాభిధానుండను కుమారుండొకండుండెను.

ఈ వీర నరసింహరాయలు తిమ్మరుసుపై నసూయాయుతుండు, ననుమానచిత్తుండునగుటచే రాజ్యము తన

కుమారునకు మంత్రి యొనఁగఁడే మోయును సందియంబునఁ గృష్ణదేవరాయలఁ బిల్కుమార్ప నెంచియుఁ దిమ్మరుసు నెడఁగల భయముచే నంయులకు సాహసింపఁజాలకుండెను. పైకిమాత్రి మాతనియెడలఁ బ్రేమానురాగంబు నగపర్చుచుఁ దన కుటిలస్వభావంబు వెలువరింపకున్నను దన యంత్యదశయందు మాత్రము వెల్లడించెను. ఒకనాఁడు తిమ్మరుసుంబిలిచి తన యనుమానము వెల్లడించి తన మరణానంతరము తనపుత్రుని రాజుగాఁజేసి పూర్వాచారమును బాలింపుమనియుఁ, దన సందియమువాపఁ గృష్ణరాయలవలనఁ దనకెట్టి యుపద్రవము పొడసూపకుండుటకై వాని కన్నులూడఁబెఱికించి తనకుఁ జూపినఁగాని తన ప్రాణములు పోవనియుఁ బలికెను. ఆపలుకులామంత్రి చెవులకు ములుకులై నాటఁ గొంతవడి నిశ్చేష్టుఁడై మౌనమువహించి, పిదప ధైర్యము వహించి తప్పక స్వల్పకాలంబులోన వానికన్నులఁ దెచ్చి యర్పింతునని యచ్చోటువాసి గృహంబునకుంజని పరిపరివిధములఁ బరివేదనమంది, దిటవూని యంయులకను వగు వెఱవూహించి, కృష్ణదేవరాయల రప్పించి వానియన్నయాన నెఱింగింపఁ బావమా బాలుండు కంపితగాత్రుండై తనకు సవతితల్లి విషప్రయోగ మొనర్పఁ బ్రయత్నించినది మొదలానాఁటిదనుక నా తండ్రొనర్చిన బహువిధోపకారములనెల్ల నుగ్గడించి కంటికి మంటికేకధారగా రోదనమొనర్పు

చుఁ దనకు రాజ్యము వలదనియుఁ దానెందేనిఁజని సుఖము
గా జీవింతుననియుఁ, దన్నంధునిగాఁ జేయవలదనియుఁ
బెక్కుగతులఁ బ్రార్థించెను. వానియారాటమునునయించి
వీపుతట్టి "కుమారా! భయమందవలదు. నిన్ను నేను రక్షించి
యీ కర్ణాట సామ్రాజ్యమునకు నభిషేకింతు. రాజు
మరణించువఱకు నెవ్వనికంటఁ బడకుండ నాయింట నుం
డుము." అని తిమ్మరుసాతని కభయహస్తమిచ్చి యొక
మేఁకను దెప్పించి దానికన్నులఁగొని ప్రాణములఁ బాయు
నున్న వీర నరసింహరాయలకుఁజూప నాతఁడు సంతసించి
నిజపుత్త్రు మంత్రికప్పగించి ప్రాణముల వదలెను. అనంత
ర మర్హంబగు సంస్కారంబు లాచరింపఁజేసి యొకనాఁడు
కృష్ణదేవరాయలఁ జక్రవర్తిగాఁ బ్రకటించెను.

## —♦ కృష్ణదేవరాయల పట్టాభిషేకము. ♦—

మహాప్రధానాగ్రగణ్యుండైన తిమ్మరుసుయొక్క
బుద్ధిబలమె కర్ణాటక సామ్రాజ్యమున కంగరక్షగా నుం
డెను. దానంజేసి సర్వజ్ఞుండగు మంత్రిశిఖామణి కెదురాడ
వెఱచి కృష్ణదేవరాయల పట్టాభిషేకము నెవ్వరాటంకముఁ
గలిగింపఁజాలక పోవుటయేగాక యాతనియెడల భక్తివిశ్వా
సము లగపఱచుచుంటచేఁ దిమ్మరుసుమంత్రి సులభము
గాఁ దన ప్రతిజ్ఞా నిర్వహణ మొనర్పఁగొనఁ గలిగెను. క్రీ॥
శ॥ 1509 వ సం॥ ఫిబ్రవరి 4 వ తేదీని కృష్ణరాయల పట్టా

భిషేక మహోత్సవము నడుప మంత్రి చూడామణి
నిశ్చయించి యానాఁటికి విచ్చేయ రాజ్యమునం బెక్కుండ్రి
కాహ్వానములంపినగరమునందంతట నలంకారముగావింపఁ నమ్మ
హోత్సవముఁ దిలకింపఁ బెక్కుండ్రు సామంత భూపతు లా
నాఁటికి విజయనగరమునకు విచ్చేసిరి. అంత రాయలఁ
బన్నీట జలకమాడించి సర్వాంగభూషితుఁ గావించి సేవ
కాళి సభాస్థలికిఁ గొనిరా సిద్ధముగనుండినతఱిఁ దిమ్మరుసు
రాయలడాసి, యొక రహస్య మపదేశింపవలసి యుండెనని
చెప్పి రాయల నొకగదిలోనికిఁ గొంపోయి యొకచెంప
కాయఁ గొట్ట రాయలాదెబ్బకుఁ దలదిమ్మెక్కి నేలఁజతికిలఁ
బడఁ దిమ్మరుసు వానియెదుట నేడ్చుచునిలఁబడ రాయలు
గొంతవడికిఁ దెప్పిరిలి తనయెదుట నేడ్చుచు నిలిచి యుండిన
తిమ్మరుసు రాయల గాఢాలింగనముఁగావించి రాయలదే
హము నొచ్చినందులకుఁ దన్ను నిందింపవలదనియు, దండ
నాపారుష్యమువలనఁ బ్రజలకుఁగలుగు బాధలఁ బ్రభువునకు
స్వానుభవము గలిగినచోఁ బ్రజలు సుఖింతురనియుఁ,
దానంజేసి రాజుయొక్కకీర్తి విస్తరించుననియు, నిఁక నుందీ
విషయము నెఱింగింపుటకుఁ దనకవకాశము లభింపమి నిపు
డెఱింగించితిననియుఁ బలుక రాయలాతని బుద్ధికిమెచ్చి
యనామడించిన సత్కారములొనర్పఁ దిమ్మరుసు రాయలఁ
బునరాలింగనమొనర్చి విశేష ధనముతోనిండిన బొక్కస

మును వశముఁగావించుకొని వజ్రసింహాసన మధిష్ఠించి యాచంద్రార్కముగా రాజ్యముఁ బాలింప దీవించి, వెలుపలకుం గొనితెచ్చి గజారోహణముఁ గావించి, తానొక గజము నధిష్ఠించి జయజయనినాదంబులు బోరుకలంగ నూరేగించి రాజభవనంబునకుం గొనితెచ్చి యొండటనను త్సంబున రత్నసింహాసనాసీనుఁగావించి నిజప్రతిజ్ఞా నిర్వాహణముఁ గావించెను.

రాయుల పట్టాభిషేకమునకుఁ బూర్వమె చెఱసాల బంధింపఁబడిన తిరుమల రాయామాత్య రాయుల విముక్తుల గావించి వారిజీవనార్థము కొంత ప్రదేశమొసంగి గారవింపఁగోర రాయలు వారల విడుదలఁగావించి చంద్రగిరి దుర్గంబును వారి జీవనంబునకొసంగెను. అటులఁగొంత కాలంబు గడువ రాయలొకనాఁడు తిమ్మరుసును బిలిచి తనకు దక్షిణదేశ యాత్రసల్ప నుద్దేశముగలదని నంపులకు వలసిన సర్వ సన్నాహంబులొనర్చి, జయము సేకూర్చి, జయముఁ బడసిన నెల్లచోటుల జయాంకములఁ బ్రతిష్ఠింపించి, భూరి దానంబులఁ జేయించి జనుల విశ్వాసమునకుఁ దిమ్మరుసు మంత్రిశిఖామణి, పాత్రుండయ్యెను. ఈదిగ్విజయ యాత్రా సందర్భంబున రాయలకు ననేకాపాయములు వాటిల్ల నయాత్యావతంసుండు వానినెల్లఁ దన యుపాయంబులఁ దప్పించి, శ్రీరంగపట్టణాధీశుండగు వీర శ్యామల రాయని పుత్రిక

యగు తిరుమలాంబను బరిణయముఁ గావించి, పిన్ననాఁట నుండియు మక్కువఁగొనియున్న చిన్నమ్మాదేవిని గూడ వివాహ మొనర్చెను. రాజ్యరక్షణకు వలయు గజాశ్వరథంబుల వృద్ధిఁగావించి, మూలబలంబుఁ బెంపొనర్చి వలసిన సర్వవిధ సంస్కరణములఁ గావించి యలరారెను.

దక్షిణదేశ యాత్రానంతరము మంత్రి వలదను చున్నను మానక రాయలు పూర్వదిగ్విజయాత్రకు వెడలి రాజమహేంద్రవరము, సింహాచలము మున్నగు ప్రదేశము లాక్రమించి కటక పురాధీశుండైన ప్రతాపరుద్రగజపతి నోడింప సాహసించి తత్పురముపై దండెత్తెను. అచటఁగల పాత్రసామంతులు బలభద్రపాత్రుఁడు, దుర్గాపాత్రుఁడు మొదలగు పదునాఱుగురు రోషావేశులై రాయలఁబట్టియిచ్చెద మని గజపతికిం దెల్పి యుద్ధమునకు సిద్ధపడ, దేశమరణ్యమగుటను రాయుల సైనికులు మార్గాయాసంబున వ్యాధిగ్రస్తులగుటచేఁ బాత్రులసైనికులకుంజిక్కి యోడుటకు సిద్ధముగానుండుట రాయలుగాంచి, యెంతయుఁ బరితపించి, తదరక్షణోపాయమునకై మంత్రిని బ్రార్థింప నాతండొకనాఁడు నిజసైనికులఁగొందఱరావించివారికందఱకుఁ దలకొకధనపూరితమందసమునొసఁగి "మీరుగావించినవాగ్దానమున కెంతయు ముదమందితిమి. మీరు చెప్పినటులఁ బ్రతాపరుద్రగజపతినిఁ బట్టియిచ్చిన వెంటనే మీకింతకంటె నెక్కుడుసన్మానము

లోసంగెదము” అని పాత్రిలపేరఁ గమ్మలవ్రాసి, పెట్టెల లోనుంచి గజపతి చూచునటుల నాసైనికులఁ బాత్రిలకడ కనిచెను. అంత రుద్రపతి యాసైనికులను, వారు గొంపోవు మందసములను గాంచి, వారలఁబట్టి రప్పించి, యామంద సములను దెఱచి యందలి యుత్తరములలోని సంగతులఁ జదివి పాత్రిలు తనకపకారముగావింపఁ దలఁచిరని యూ హించి భయపడి సామంతులకుఁ దెలియకుండ రహస్యమా ర్గంబున సమరావనినుండి తొలంగెను. తమప్రభువు గాన రామి సైనికులు నిరుత్సాహమంది యాహవపరాఙ్ముఖులు గా మంత్రిసత్తముండు గజపతి కడకేగి యత్యంతసత్కృతుం డయి వానితో సంధిఁగావించి, యాతనికూఁతు రన్నపూర్ణా దేవిని రాయల కుద్వాహమొనర్చి తన చతురుపాయముల బ్రదర్శించి రాయలకు విజయము చేకూర్చెను.

## — విద్యాగోష్ఠి —

అఘటన ఘటనా సామర్థ్యముఁగల యమాత్యశేఖ రుండయిన తిమ్మరుసు సంస్కృతాంధ్రభాషలయందసమాన పాండిత్యముఁబడసి, కర్ణాటాంధ్ర పారసీభాషల వ్యవహారం బులు నిర్వహింపఁగలిగిన దిట్టయై యగస్త్యేశ్వరవిరచిత బాల భారత వ్యాఖ్యాతయై, యాంధ్రభాషా పక్షపాతియై, బహు శాంధ్రకవిమండలమునకు శాశ్వతోపకారములు సల్పి వారి ప్రస్తుతులకుఁ బాత్రుఁడై, సంస్కృతాంధ్ర భాషల

సరసమైన కవిత్వము సెప్పఁగలిగిన కవీంద్రుఁడై, విద్యాధిక
ప్రపంచంబునఁ గీర్తి విలసితుఁడయ్యెను. ఒకనాఁడు భట్టు
మూర్తి యితని యసమాన మేధాసంపత్తికిని, రాజామాత్యు
ల విశేష పరస్పరానురాగంబునకు నాశ్చర్యపడి,

"కం॥ అయ్యా యనిపించుకొంటివి
నెయ్యంబునఁ గృష్ణరాయ ♦ నృపపుంగవుచే
నయ్యా నీసరియేరీ
తియ్యని విలుకాఁడవయ్య! ♦ తిమ్మరుసయ్యా!"

అని శ్లాఘింప నాకవిచంద్రు నెంతయుఁ గౌరవించి
తినకు రాయలొసఁగిన పచ్చలహారము నాతని కంఠంబునఁ
గీలించెను.

—♦ తి మ్మ రు సు ప రి పా ల న ము. ♦—

సాళువ నరసింహదేవ నృపేంద్రుఁడు పట్టాభిషిక్తుండైనది
మొదలు నలువది వత్సరములు తిమ్మరుసుమంత్రి యఖండ
విజయులబ్ధుండై రాజ్యము నుత్కృష్ట స్థితికిం దెచ్చి, ఖండాం
తరంబులఁ గీర్తి వ్యాపింపఁజేసి, రాజకుటుంబ కలహంబు
లడంచి, విప్లవకారుల సంహరించి, శత్రురాజుల నుక్కడం
చెను. కులమతభేదములను, బ్రాహ్మణాబ్రాహ్మణ పక్ష
పాతమును బాటింపక యర్హుల నున్నతపదవుల నిల్పి, యన
ర్హులఁ దొలఁగించెను. పథికులకనువగు బాటల నిర్మించి, జ
లాశయముల వెలయించి శిల్పకళల నభివృద్ధిగావించి,

దేవాలయ మందిరంబుల నిర్మాణముచేయించి, జనులు భరియింపలేని సుంకముల మాన్పించి, భాషాభివృద్ధి నొనర్చి, పాఠశాలల స్థాపించి, విద్వాంసులను, విప్రులను, భూరిదానంబుల సత్కరించి, విదేశవ్యాపారాభివృద్ధి గావించి, సర్వజనానురంజకముగా రాయలచే రాజ్యమును బూజ్యంబుగా నేలించి, పాశ్చాత్యుల సైతమిట్టి ధీవిభవశాలి గన్నట్టఁడను కీర్తిఁ గాంచెను. వేయేల? కృష్ణదేవరాయల రక్షించి, పోషించి, రాజ్యమిప్పించి, దిగంత యశోవిశాలు గావించి మించెను. ఏనాఁడు మంత్రులు ప్రజాభిమానమూని, దేశాభిమానావేశులై, దేశముద్ధరింపఁ గంకణముఁ దాల్చి, రాజులకాలోచనము లిడుదురో నాఁడే దేశము నిత్యకళ్యాణము, పచ్చతోరణమునై సౌఖ్యాబ్ధి నోలలాడును. నాఁడే దేశమునఁ గఱవు గఱవగును, సుభిక్షము వెల్లివిరియును.

—♦ అంత్యదశ. ♦—

తన మరణానంతరము తన తమ్ములు గాని, తిమ్మరుసు గాని తనపుత్త్రుని బట్టాభిషిక్తుగావింపరని రాయలు సందేహించి తన జీవితకాలంబుననే నిజపుత్త్రు రాజ్యమున కభిషేకించి, తాను మంత్రియై, మంత్రిశేఖరుండయిన తిమ్మరుసును గార్యనిర్వాహకునిగా నొనర్చి, వాని కుమారుండగు గోవిందరాజును సైన్యాధ్యక్షునిగా నియమించెను. రాజయిన రాయలపుత్త్రుండప్పటి కాఱేండ్ల వయసుకలిగి యుండెను.

ఇటులఁ గొంతకాలము జరుగుడు నొకనాఁడా బాలరాజాక స్మిక వ్యాధిపీడితుఁడై మరణింప మంత్రిశేఖరుని ప్రత్యర్థులదియే సమయమని యెంచి యాబాలరాజు నీ బాల సై న్యాధ్యక్షుఁడే విషప్రయోగంబున మరణింపఁజేసెనను ప్రవదంతి వ్యాపింపఁజేసి గాయలకావిషయ ముద్బోధించిరి. అంత రాజు క్రోధపరవశుఁడై కొల్వుదీర్చి, తిమ్మరుసును, వానిపుత్రుని, సోదరుని, రాజ్యంబునందున్న తపదవు లధిష్ఠించియుండిన వాని బంధువర్గమును, రప్పించి యందఱు వినునటుల నిట్లనియెను. "సచివాప శదా? నీవు నీ పుత్త్రుఁడు గోవిందరాజు రాజద్రోహులనుటకు సంశయములేదు. ఏల యన నాసోదరుండు రాజుగానుండిన కాలమందు నాకన్నులఁబెఱికి తెమ్మన మేఁక కన్నులఁగొనిపోయి వానికింజూపి నాకన్నులని వాని మోసగించి రాజద్రోహమొనర్చితివి. ముద్దుగేండ్ల* ముద్దుబాలునిదద్దయు హద్దుమీఱి నిర్దయుండై నీతనయుఁడు విసమిడీయసువుల మొసపయిపుడు రాజవిద్రోహాకరుండయ్యె దానంజేసి నీయాదిగాగల బంధుబృందమంతయు రాజద్రోహ పూరితంబగుడు మిమ్ము'నెల్లర బందీకృకృతులఁ గావించితినని తెలిపి యచ్చోటు వాసి చనియె. అంత వారందఱు గారంబంధింపఁబడఁ దిమ్మరుసు కొమరుండు గోవిందరాజు బందిగంబునుండి యెటులనో తప్పించుకొని

మూఁడు + దుగ = ముద్దుగ = ఆఱు

సైన్యముం జేర్చికొని రాయలతో రణము సల్పి కీర్తిహస్త గతుండయ్యెను. రాయలు తిమ్మరుసు ప్రభృతుల కన్నులూడం బెరికింప నావృద్ధబాహ్మణుండు బందిగంబున నవసిదివంగతుండయ్యెను. అనేకాపాయంబులనుండి తన యుపాయంబుల రాయలంగాపాడి పుత్త్రి వాత్సల్యంబు నెఱపిన తిమ్మరుసు నెడల విశ్వాస హీనుండయి, కౄరుండయి, యుచితానుచిత జ్ఞాన రహితుండయి, స్వార్థపరుండయి, పరశురాముం బోలిన బరాక్రమ సంపన్నుని, నశ్వత్థామవంటి యాజేయుని, దిమ్మరుసుని వార్ధక్యంబునం గ్రూరశిక్షకుం గావింపుట కడు గర్హణీయము. రాజభక్తికిం బుట్టినిల్లగు తిమ్మరుసు కుమారుండు గోవిందరాజు బాలరాజుం జంపింపం దగిన కారణము గలదా? సింహాసన మధిష్ఠించి రాజ్యమేలు నాశ యతనికుండునా? ఉండిన సంభవము గాఁగలదా? తిమ్మరుసే జనియింపకుండిన కృష్ణరాయల విజయము విజయముగ మాఱియుండదా! ఏదియెటులున్న నిందలి యుక్తాయుక్తములు పాఠకులే నిర్ణయింతురుగాత.

సర్వమంగళాచంద్రశేఖరులు సర్వమంగళంబులు సర్వుల కొసంగుదురుగాత.

సంపూర్ణము